భూ·మి·దా·న
యజ్ఞము

# పవిత్ర సన్నివేశములు

భూదాన సాహిత్య ప్రచార సమితి
హైదరాబాదు

# పవిత్ర సన్నివేశములు

*

ర చ న
మృదుల షూందడా

అ ను వా దం
సంతపురి రఘువీరరావు

*

ప్ర కా శ కు లు
భూదాన సాహిత్య ప్రచారసమితి
హైదరాబాదు
1956

# అనుక్రమణిక

౧

# గంగోత్రి

శ్రీరామనవమి ౧౩ ఏప్రిల్ నాడు తెలంగాణ యాత్ర ప్రారంభమైనది. ఈ యాత్రలో ఏప్రిల్ ౧౮ వ తేదీనాటి మజిలీ పోచంపల్లి. ఇది నల్లగొండ జిల్లాలోని మొట్టమొదటి గ్రామము. ఈ గ్రామము కమ్యూనిస్టు ఉద్యమానికి పెట్టనికోట. హత్యలు లూటీలు మొదలైనవానికి ఆలవాలమైనది.

గ్రామవాసులు హృదయపూర్వకంగా వినోబాజీకి స్వాగత మొసగినారు. చందన సుగంధములు, పుష్పమాలలు, ఫలసమర్పణము, పురుషసూక్త పఠనము మొదలైనవన్నీ యథావిధిగా జరిగినవి.

వినోబాజీ గ్రామ ప్రదక్షిణకు బయలుదేరినారు. ముందు హరిజనగూడెంలోకే వెళ్ళినారు. ఇండ్లలోపలికి వెళ్ళి చూసినారు. ఒక ఇంటిలోనికి వెళ్ళి నవజాత శిశువును చంక నెత్తుకున్నారు. రోగుల పరిస్థితి నవలోకించినారు. ఆహారసామగ్రిని పరిశీలించి నారు. వారు నడుస్తుంటే గూడెమంతా వారివెంటనే నడిచింది.

తిరిగి పోతూవుండగా హరిజనులు "మీరు మా ఇండ్ల పరిస్థితి చూసినారు. మా కుటుంబాలు చాలా ఉన్నవి. చోటు చాలా తక్కువగా ఉన్నది. ఇండ్లకోసం ప్రక్కనున్న స్థలం ఇంకా కొంచెం లభిస్తే సరిపోతుంది. దగ్గరే చోటుకూడా ఖాళీగా

ఉన్నది'' అని వినోబాజీతో మనవి చేసినారు. వినోబా ఏమో ఆలోచిస్తూ ముందుకు నడచినారు.

ప్రజలు ఆశతో వెనకాలే నడుస్తున్నారు. వినోబాజీతో బసవరకు వెళ్ళినారు. బసదగ్గర మిగతా గ్రామస్థులు కూడా సమావేశమై యున్నారు. వినోబాజీ ఆసనంమీద కూర్చుంటూ హరిజనసోదరుల నుద్దేశించి 'ఏం ఇంకేమైనా చెప్పవలసిఉన్నదా?' అన్నారు

'ఔనండి' అని సమాధానం వచ్చింది.

'చెప్పండి' అన్నారు వినోబాజీ.

కూలీ చేసుకోటం తప్ప మా కింకేవృత్తికూడా లేదు. కూలి దొరకడం, దొరక్కపోవడం యజమానుల ఇష్టాయిష్టతల పైన ఆధారపడి ఉంటున్నది. పని దొరకనినాడు పస్తు పడుకోవలసి వస్తున్నది. వ్యవసాయం చేసుకొనడానికి మా కేమైనా భూమి దొరికితే బాగుంటుంది. గౌరవంగా తిండి సంపాదించుకో గలుగుతాము' అన్నారు హరిజనులు.

'ఎన్ని కుటుంబా లున్నాయి ?'

'ముప్పై'

'భూమి ఎంత కావాలి ?'

ప్రజలు పరస్పరం విచారించుకొనడం ప్రారంభించినారు. వాళ్ళల్లో పెద్దమనిషి ఒకాయన 'ఎనభై యెకరాలు సరిపోతుంది. ఇంకేదైనా కూలికూడా చేసుకొంటాం' అన్నాడు.

'ఇక్కడ సర్కారు భూమి చాలా పడివుం' దన్నాడు ఒక సోదరుడు.

'సరే మీరు ఒక దరఖాస్తు వ్రాసి యివ్వండి. సర్కారు వారికి పంపించుతాం' అన్నారు వినోబాజీ.

ఈ మాటలు అని వినోబాజీ మళ్ళీ ఆలోచనలో పడ్డారు. 'దరఖాస్తు ప్రభుత్వం దృష్టికి పోయేదెప్పుడు? వాళ్లు విచారణ చేసేదెన్నడు? వీళ్ళకు భూమి దొరికేదెన్నడు? అప్పటివరకు వీళ్ళగతి ఏమికాను?'—అన్న ఆలోచన రావడంతోనే వినోబాజీ నవ్వుతూ, 'ఇక్కడ భూమిగలవాళ్లెవరూ లేరా?' అని ప్రశ్నించారు. సమాధానంకోసం ఎదురు చూడకుండానే 'మరి వీరంతా కూడా మన సోదరులేకదా. మీలోనుండి ఎవ్వరూ వీరి కోరికను పూర్తిచెయ్యలేరూ?' అని అక్కడ సమావేశమై యున్నవారిని ప్రశ్నించినారు.

క్షణంపాటు సభ పూర్తిగా నిశ్శబ్దమైంది. తర్వాత ఒక సోదరుడు లేచి వినయంగా 'వినోబాజీ! కీర్తిశేషులైన మా తండ్రిగారి స్మృతిచిహ్నంగా వంద యెకరాలు అర్పించ దలచుకున్నాను. స్వీకరించండి' అన్నాడు.

వారే శ్రీ రామచంద్రా రెడ్డిగారు. ఆ నూరు యెకరాలకు దానసంకల్పపత్రము వినోబాజీ పేర వ్రాసి యిచ్చినారు. వారు వ్రాసియిచ్చిన దానపత్రం పైన ఇద్దరు సాక్షులుగా సంతకాలు పెట్టినారు.

ఆ భూమి పర్పాట్లకుగాను అయిదుగురితో ఒక సంఘము పర్పడింది.

ఈ విధంగా భూదాన గంగోత్రి ప్రారంభమయింది.

## ౨

# భీమ జరాసంధులు -
# రామ లక్ష్మణు లైనారు

తంగెళ్ళపల్లి కుగ్రామం. కాని ఆ వూళ్ళో పెద్ద వివాద మొకటి తలఎత్తింది. ఆ వివాదం ఇద్దరు అన్నదమ్ములకు చెందినది. ఈ ఇద్దరిమధ్య వచ్చిన వివాదం ఊరంతటికీ ప్రాకి ఊళ్లో రెండు కడులైనవి. ఒక కడువారు రెండో కడువారి ముఖమైనా చూడటానికి ఇష్టపడని స్థితి సంభవించింది. ఇద్దరిలో ఒకరు అక్కడనే ఉంటూవుండిరి. రెండోవారు ఊరు వదిలి వెళ్ళిపోయి యుండిరి. వినోబాజీ బస వారింట్లోనే ఏర్పాటైంది కనుక ఆ సందర్భములో వారుకూడా ఆనాడు గ్రామానికి వచ్చియుండిరి.

'మీ ఊరి కష్టాలేమిటి?' అని గ్రామస్థుల్ని అడిగారు వినోబాజీ.

'ఈ వివాదమే మమ్మల్నందరిని బాధపెడుతున్నది. ఇది సమసిపోతే అందరం సుఖంగా ఉంటాము' అని గ్రామస్థులు సమాధానం చెప్పినారు.

వినోబా ఇద్దరన్నదమ్ములకు నచ్చచెప్పినారు. ఇద్దరూ తమ క్షేమం తెలుసుకున్నారు. కొన్ని సంవత్సరాల తర్వాత తోటియాత్రికుల పంక్తిలో వారిరువురూ ప్రక్కప్రక్కన కూర్చొని

ఆనాటి సాయంత్రం భోజనం చేసినారు. ప్రార్థన సమావేశంలో అన్నదమ్ములు ఆలింగనం చేసుకొన్నారు. ఇద్దరి కన్నులలో పశ్చాత్తాపభావంతో కూడుకున్న ఆనందాశ్రువులు నిండినవి. భీమ జరాసంధులవలె ఉండిన అన్నదమ్ములిద్దరూ ఆనాటినుండి రామ లక్ష్మణు లైనారు. తర్వాత ఇద్దరూకూడా భూదానములు లిచ్చినారు.

3

# ఆరవ పుత్రుడు

భూదానగంగ మెల్లమెల్లగా ముందుకు ప్రవహిస్తూ పోయింది. ఒక చిన్న పల్లెటూళ్లో వినోబాజీ తెలుగుభాషలోనే గ్రామస్థులలో చర్చిస్తూవుండిరి. ఒక సోదరుణ్ణి 'మీదగ్గర భూమి ఎంత వున్న'దని అడిగినారు.

'కేవలం తొమ్మిది యెకరాలుమాత్రమే'నని సమాధానం వచ్చింది.

బాబా : యజ్ఞంలో ఆహుతి అర్పించినారా, లేదా ?

అతడు : (నవ్వి) అయ్యా! నాకు అయిదుగురు కొడుకు లున్నారు. ఒక్కొక్కనికి రెండెకరాల చొప్పునైనా రాదు. ఇకమరి మీ కేమి ఇవ్వగలను !

బాబా : మీకిప్పుడు అయిదుగురు కొడుకు లున్నారు. ఒకవేళ పరమేశ్వరకృపవల్ల ఆరవకొడుకు కూడా పుడుతా డను

కోండి. అప్పుడు మీరు 'నాయనా నువ్వు ఆలస్యంగా జన్మించినావు. ఇక నీకోసం భూమి లేదు. ఇదివరకే పంచివేయబడింది. ఇక నీవు వెళ్ళిపో, అని అంటారా ?'

వినోబాజీ ప్రశ్న ఆ సోదరుని హృదయాన్ని కలచి వేసింది. చేతులు జోడించి, 'అట్లా జరగజాలదండీ - ఇవ్వవలసే వస్తుంది' అన్నాడు.

అప్పుడు బాబా అన్నారు: 'అయితే నేనే ఆ ఆరవ కొడుకు ననుకోండి. ఇక నా భాగం నా కివ్వండి.'

ఆ రైతు బాబా ముఖంలోకి చూసినాడు. ఆ ముఖంలో అతనికి తన కొడుకు రూపమే కనిపించిందో లేక సాక్షాత్ పరమేశ్వర దర్శనమే అయిందో తెలియదు. వెంటనే ఆరవభాగం వ్రాసి ఇచ్చినాడు.

౪

# నా దానపత్రంకూడా పూర్తిచేయవలసింది

నల్లగొండ జిల్లాలో ఆఖరుమజిలీ సూర్యాపేట. కార్యకర్తల సమావేశం జరుగుతూవుండెను. జిల్లాలోనుండి చాలా మంది కార్యకర్తలు వచ్చియుండిరి.

నిజంగా భూదానగంగ ప్రారంభమే అది. తమ అనుభవాలను తెలుపుతూ 'కార్యకర్త తన భాగాన్ని ఇవ్వనంతవరకు ఇతరులను భూదానము అడుగజాలడు' అని వినోబాజీ అన్నారు.

కార్యకర్తలు ఆలోచిస్తూ ఉండినారు. భూమి చాలా మందిదగ్గర ఉన్నది. కాని ముందు ఎవరు లేవడమా అని ఆలోచిస్తున్నారు.

శ్రీ కోదండరామరెడ్డి యాత్రప్రారంభంనుండి మాతోటి యాత్రికులుగా ఉండినారు. నల్లగొండజిల్లాలోనే ఒక గ్రామం వారిది. వారు ఇద్దరన్నదమ్ములు. అవిభక్త కుటుంబంలోనే ఉంటూఉండినారు. ఇద్దరికీ కలిసి నాలుగువందల యెకరాల భూమి వుండెను. రెండవ సోదరుడుకూడా ఆనాడే రావలసి వుండినది. కాని ఆ సమయంవరకు వారక్కడికి చేరుకోలేదు.

కార్యకర్తల ఆలోచనలు ఇంకా తెగనేలేదు. ఎవరూ ధైర్యంచేసి ముందుకు రావడంలేదు. శ్రీ కోదండరామరెడ్డి గారు ఒకసారి సహచరులవంక చూసి చిరునవ్వుతో లేచి నిలుచున్నారు. 'మేమిద్దర మన్నదమ్ములము. నా భాగానికి రెండు వందల యెకరాల భూమి వస్తుంది. అందులోంచి సగం నూరు యెకరాలు పూజ్య వినోబాజీ భూదానయజ్ఞంలో సమర్పిస్తున్నాను' అని శ్రీ రెడ్డిగారనేటప్పటికి కరతాళధ్వనులు మిన్ను ముట్టినవి. మిగతా కార్యకర్తలలో సంచలనం బయలుదేరింది. ఒక్కొక్క కార్యకర్తే లేవడం దానపత్రం పూర్తిచేయడం ప్రారంభమయినది.

సాయంత్రం కోదండరామరెడ్డిగారి అన్నగారు సూర్యాపేట చేరుకున్నారు. ఆయన వినోబాజీ ముందు గంభీరంగా ఇట్లన్నారు.. 'మేమిద్దరము అన్నదమ్ములము. ఇప్పటివరకు ఒకే చోట ఉన్నాము. ఏ విషయంలోకూడా మా ఇద్దరిలో విభేదం

రాలేదు. ఇవాళ నా తమ్మునిలో భేదభావం ఎందుకు కలిగిందో మరి కేవలం తనవంతు భూమిని మాత్రమే దానం చేసినాడు. మొత్తం భూమిలోంచి సగం యిచ్చినట్లయితే నేను వద్దనే వాడినా? ఈ మాట లంటుంటే ఆయన కంఠం రుద్ధమైంది. తన భాగంలోనుంచి నూరు యెకరాల దానపత్రం కూడా ఆయన పూర్తిచేసి యిచ్చినారు.

శ్రీ కోదండరామ రెడ్డిగారు ప్రారంభంనుండి ఇప్పటి వరకు బాబాతోనే ఉంటున్నారు. వారి సతీమణి శరీరం చాలా వరకు అస్వస్థతగా ఉంటుండేది. అయినా వారికెప్పుడూ భూదాన విషయమైన చింతనమే. వేలకొలది యెకరాల భూమి వారిది వరకు పంచినారు. క్రొత్తభూమి కూడా చాలా సేకరించినారు. హైద్రాబాదు కాంగ్రెసు మిత్రులు వారిని ఎన్నికలకు నిలువ వలసిందని ఎంత ఒత్తిడి చేసినప్పటికినీ వారు నిలువలేదు.

౫

# రెండెకరాలలోనుంచి ఒక యెకరం

సూర్యాపేటలోనే జరిగిన మరొక విశేషం. సాయంత్రం సభ బాగా జరిగింది. సోదరీమణులుకూడా ఎక్కువ సంఖ్యలో హాజరయినారు. ఆ సమావేశంలో భూదాన తత్త్వం సరియైన భాషలో చక్కగా తెలియజేయబడింది. ఒక సోదరీమణి ఇల్లు

విడిచి ఎక్కువ సమయం ఉండజాలకపోయేది. బాబా ప్రవచనం వినాలని ఆమెకు ఎంతో కుతూహలంగా ఉండేది.. కాని ఇంట్లో చిన్నచిన్న పిల్లలున్నారు. ఆమె ఎలాగో సభ పూర్తి అయిం దాకా ఉండి వెళ్లిపోయింది. మరుసటిరోజు తెల్లవారుఝామున బాబా ప్రయాణమై బయలుదేరుతున్నారు. ఇంతలో ఆమె పరు గెత్తుతూ వచ్చి, 'బాబాజీ, నాదగ్గర రెండెకరాల భూమి మాత్రమే ఉన్నది. ఒక యెకరం భూదానంగా యివ్వాలని వచ్చాను' అన్నది. ఆమె భూమితోపాటు ఒక గోవును కూడా దానంగా సమర్పించింది.

బాబా ఈవిషయాన్ని అనేకసార్లు పేర్కొంటూఉంటారు. 'ఒక సోదరి పరుగెత్తుతూవచ్చి తనకున్న రెండెకరాల భూమిలో నుంచి ఒక యెకరం భూమియిచ్చింది. పెద్దవాళ్లు ఇంకెట్లా ఊరుకోనగలుగుతారు? చిన్నవాళ్ళ త్యాగం పెద్దవాళ్ళచేత కూడా త్యాగం చేయిస్తుంది' అని వినోబాజీ అంటూవుంటారు.

౬

# సురగాంవు శుభాకాంక్షలు

ప్రధానమంత్రి ఆహ్వానమును పురస్కరించుకొని వినోబా ఢిల్లీ వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. వెళ్ళడానికి ఒకరోజు ముందు వారు సురగాంవు ప్రజల్ని కలుసుకోవడానికి వెళ్లినారు.

'నేను ఢిల్లీ వెళుతున్నాను. దారిపొడుగునా భూమి అడుగుతూ వెళ్తాను. ఇన్నాళ్లు మీ మధ్య ఉన్నాను. సుర గాంవులో ఎన్నెకరాల భూమి దొరికిందని ప్రజలడిగితే ఏం చెప్పను ? నా కోరిక ఆరవభాగం' అన్నారు వినోబా.

సురగాంవు భూమి చాలా సారవంతమైనది. ప్రజలు ఆ భూమిపైన చాలా శ్రమచేసినారు. అరటి మొదలైన పళ్ళ తోటలెన్నో ఉన్నవి. వినోబా కోరికను పురస్కరించుకొని గ్రామ వాసులు అరవై యెకరాలిచ్చి తమ శుభాకాంక్షల్ని తెలిపి సాగనంపినారు. 'శుభాస్తే పంథానఃసంతు' అని.

౭

# అసంపూర్ణమైన ప్రేమ నేను చూపలేను

ఢిల్లీయాత్ర ఏదో ఒకగొప్ప భవిష్యత్కాంతి సూచించేదై యుండెననికావచ్చు వార్ధానుంచివెళ్ళే సమయంలో ఒకదాని కంటే ఒకటి శుభసంకేతము లనేకము కనపడుతూ వచ్చినవి.

శ్రీ దత్తోబా దాస్తానే వినోబాజీకి దగ్గరివారు. ఆశ్రమ వాసులు. ఎన్నోరోజులవరకు వినోబాజీకి కార్యదర్శిగా దత్తోబా సమర్థతతో పనిచేసియుండిరికూడా. వారిది పెద్ద కుటుంబము- వారి సతీమణి, ముగ్గురు మగపిల్లలు, తండ్రిగారు. బాపూజీకి పురాతన అనుచరులలో ఒకరు. వారికి పద్దెనిమిదెకరాల సొంత

భూమి ఉండెను. వినోబాజీ ఢిల్లీకి బయల్దేరి వెళ్లుతూవుండిన సందర్భంలో ఆయన ఆపద్ధెనిమిదెకరాలూ దాన పత్రం వ్రాసి వినోబాజీ పాదాలపైన పెట్టినారు.

వినోబాజీ తక్షణమే సహజభావంతో 'దత్తోబా చిన్న నాటినుండి నాదగ్గరే పెరిగి పెద్ద అయినాడు. నేను అతనిపైన అసంపూర్ణమైన ప్రేమను చూపబాలను' అని దానపత్రాన్ని స్వీకరించారు.

౮

# పఠాన్ ప్రతిజ్ఞ

నాగపూరు వెళుతుంటే మధ్యన గుమ్‌గాంవ్ అనే ఊరు వస్తుంది. మొహమ్మద్ పఠాన్ గుమ్‌గాంవ్ నివాసి. చాలా పురాతన కాంగ్రెసు కార్యకర్త. జైలులో వినోబాజీదగ్గర ఖురాన్ షరీఫ్ కూడా చదువుకొంటుండేవాడు. వినోబాజీ ఢిల్లీ యాత్రలో గుమ్‌గాంవ్ పేరు లేదని తెలుసుకొని పవనార్ వచ్చి యాత్రలో గుమ్‌గాంవ్‌ను చేర్చవలసిందిగా కోరినారు.

'పఠాన్‌సాహెబ్ ! దరిద్రనారాయణ రుసుము చెల్లించవలసి ఉంటుందిసుమా' అని చమత్కారంగా అన్నారు వినోబా.

'గ్రామం మొత్తంతరపున మాట్లాడటానికి నేను అశక్తుణ్ణి. గ్రామంవాళ్లు తమభాగం ఇవ్వనట్లయితే నేను నాభూమి మొత్తం వ్రాసిస్తాను' అని పఠాన్ బదులు చెప్పినాడు.

గుమ్‌గాంవ్ చేరుకున్న తర్వాత పఠాన్ గర్జించి చెప్పి నాడు. 'నేనైతే వినోబాకు వాగ్దానమిచ్చినాను. దరిద్రనారాయణుని జోలెలో మీరు మీ భాగం వేసినా వేయకున్నా నేను మటుకు నా భూమిని అర్పించగలనని వాగ్దానం చేసినాను. సత్యాగ్రహోద్యమంలో గుమ్‌గాంవ్ ముమ్ముందుగా ఉండినట్లే భూదానంలో కూడా అగ్రశ్రేణి నందుకొనగలదని నేను ఆశిస్తున్నాను.'

తర్వాత గంట గంటన్నరవరకు వందలాది ప్రజలు భూదానము చేసినారు. ఆ దృశ్యం ఎంతో హృదయంగమంగా ఉండినది.

౯

# పిల్లల్ని సోమరుల చేయదలచుకోలేదు

సాగర్ జిల్లాలో చివరి మజిలీ సాగర్. దారిలో ఒక గ్రామంలో ఆ గ్రామ వాసులు యాత్రను ఆపివేసినారు. అక్కడ సభ జరిగింది. వినోబా తత్వమును చక్కగా చెప్పినారు. కొన్ని దానపత్రాలు ముందే సేకరించబడియుండినవి. అవి అర్పించబడినవి.

ఒక వృద్ధుడు లేచి 'నాకున్న ఆరెకరాల భూమి మొత్తం దానం చేస్తున్నాను. స్వీకరించండి' అన్నాడు.

వినోబా అతని విషయం కొంత కనుక్కోవడం ఉచితమని అనుకున్నారు. 'మరి మీరేం చేస్తారు?' అని ప్రశ్నించినారు వినోబా.

'నేను పనిచేసుకొని పొట్టగడుపుకొంటాను. అందులో నుంచే మిగిలించి భూమి కొన్నాను.'

'పిల్లలుంటారుకదా ?'

'ఉన్నారు ముగ్గురు.'

'వారికోసం ఏమీ ఉంచరూ ?'

'వారిని నేను సోమరులను చేయదలచుకోలేదు. నేనంతా ఆలోచించే యిస్తున్నాను. స్వీకరించండి.'

ఈ దానమును, దాతను ప్రజలు ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయినారు.

## ౧౦

# బాబాజీ దీక్ష

వినోబాజీ ఉత్తరప్రదేశ్‌లో ప్రవేశించిననాటినుంచి బాబా రాఘవదాస్‌జీకూడా భూదాన ఉద్యమంలో లీనమైపోయినారు. సమాధిస్థితులైనట్లుగానే ఉద్యమంతో తాదాత్మ్యంచెందినారు.

అప్పట్లో వారు ఉత్తరప్రదేశ్ శాసనసభ్యులుగా ఉండిరి. భూమి అడగడానికి పోయినపుడల్లా జోలెనిండుగా దానపత్రాలు తీసుకొని వచ్చేవారు. మీరెంత యిచ్చినారని ఎవరూ వారిని అడగకపోయేవారు. ఎందుకంటె రాఘవబాబాజీ దగ్గర విభూతిపప్ప యింకేముండదని అందరికీ తెలుసు.

కాని బాబాజీకి శాసనసభనుంచి కొంతడబ్బు లభిస్తూ ఉండేది. అందులోనుండి మిగిలించి వారు కొంత భూమినికొని యుండిరి. భూదాన యజ్ఞములో తమ భాగమును కూడా అర్పించినారు.

వారు స్వయంగా దానం చేయటంవల్ల ఇతరులకు కూడా ప్రేరణ కలిగింది. బాబాజీ భూదాన యజ్ఞానికి ముఖ్యస్తంభము వంటివారు. పూరీ సమ్మేళనం తర్వాత భూక్రాంతిని సఫలం చేయడానికి ౧౯౫౭ సంవత్సరంవరకు అఖండ పదయాత్రచేయు సంకల్పంతో బయలుదేరారు.

## ౧౧

# చిరగాఁవ్ సత్సంగము

ఆనాడు చిరగాఁవ్‌లో బస. రెండుమైళ్ళ దూరం వరకు* శ్రీ దద్దాజీ వందలాది గ్రామస్థులను వెంటబెట్టుకొని వినోభాజీకి స్వాగతమివ్వడానికి వచ్చియున్నారు. సమూహంలో శ్రీ మహాదేవీవర్మ, కవివర దినకర్ కూడా ఉన్నారు.

దారిపొడుగునా కీర్తనలు, భజనలు మహదానందము కలుగజేసినవి. ద్వారందగ్గర తిలకం, హారతి, ఫలసమర్పణ ఇత్యాదులన్నీ యథావిధిగా జరిగినవి. భూమి ఆరవభాగంకూడా

* శ్రీ మైథిలీ శరణజీ గుప్త (సుప్రసిద్ధ హిందీకవి)

సమర్పించబడినది. వినోబాజీ పైనున్న తమ గదిలోకి వెళ్ళగానే శ్రీ సియా రామశరణజీని దగ్గరికి పిలిపించుకొని వారి హిందీ గీతానువాదమును తీసుకొని కూచున్నారు.

స్థితప్రజ్ఞ శ్లోకములు ఒక్కొక్కటే చదువుతూ అతి సూక్ష్మంగా వివేచనం సాగించినారు.

సాయంకాలప్రార్థనలో ప్రతినిత్యంమాదిరిగానే సంస్కృత శ్లోకములే చదువబడినవి. ప్రార్థన సమాప్తమైనది.

ఇక వినోబా ప్రవచనం ప్రారంభిస్తారని అంతా ధ్యాన పూర్వకంగా వారి వేపు చూడటం మొదలుపెట్టినారు. కాని ప్రవచనం ప్రారంభించటానికిముందు వినోబా గీత అనువాదం లోని పద్ధెనిమిది శ్లోకాల సారం చదివి వినిపించినారు. మరుసటి దినం ఉదయం హిందీశ్లోకాలే చదువబడినవి. అప్పటినుండిభారత దేశమంతటా హిందీ తెలిసినవాళ్లున్న చోట్లల్లా ఈ హిందీ శ్లోకాలే ప్రార్థనలో చదువబడుతున్నవి.

సభప్రారంభం కావడానికిముందు దద్దా భూదానయజ్ఞ పురుషుని స్వాగతమునకుగాను వ్రాయబడిన తమ ప్రత్యేక రచనను చదివి వినిపించినారు. కాని అంతటితో వారికి సంతోషం కలుగలేదు.

భూదాన గీతాలసంపుటం ప్రచురింపించి తద్ద్వారా వచ్చే ఆదాయంమొత్తం వారు సంపత్తిదానానికి సమర్పించినారు.

౧౨

# గ్రామగౌరవం

చిరగాంవునుంచి ఆరుమైళ్ళు ఉంటుంది బడాగాంవు. కాని వాస్తవంగా ఆ ఊరు అంత పెద్దదిగాదు. సభలోకి చుట్టుప్రక్క ఊళ్ళనుంచి ప్రజలు వచ్చియుండిరి. దానపత్రంకూడా లభించింది. కాని ఆగ్రామంనుంచి మాత్రం ఒక్కరూ దాన మివ్వలేదు. 'నారోజు సొంతం ఇక్కడ గడిచిపోయింది. కాని ఈ గ్రామం నుంచి నేను ఉత్త చేతులతో పోవలసివస్తున్నది. సరే, మీరుఈనాడు ఇవ్వలేదు. ముందు మీరంతా తప్పకుండా ఇచ్చేవారే' అన్నారు వినోబాజీ.

సంధ్యాసమయమైనది. ఒక హరిజనుడు పరుగెత్తుతూ వచ్చి అన్నాడు; 'ఇవాళ నాఊళ్ళోకి ఋషీశ్వరులు దయచేసినారు. ఉత్త చేతులతో వారు వెళ్ళిపోవటం నేను చూడలేను. నాకు ఉన్నది కొద్దిమాత్రమైనప్పటికి అదంతా అర్పిస్తున్నాను' అన్నాడు. అతను నజరానా యిచ్చి అప్పటికప్పుడే భూమిమీద యాజమాన్యపు అధికారం పొందియుండెను. తన అధికార పత్రమును, దానపత్రముగాయిచ్చివేసి అతడు వెళ్ళిపోయినాడు. గ్రామగౌరవం అతడు కాపాడినాడు. ఋషీశ్వరుణ్ణి ఉత్త చేతులతో పోనివ్వలేదు.

౧౩

# నాలుగోభాగం, జ్యేష్ఠభాగం

ఆగ్రాలో శిరోమణి పరివారమొక టున్నది. బాబా ప్రవచనం యమునాతీరంలో జరిగింది. 'ముగ్గురన్నదమ్ములుంటే నన్ను నాలుగోవానిగా గుర్తించండి. నలుగురుంటే ఐదవ వానిగా ఎంచండి. నా భాగం నా కివ్వండి' అని అన్నారు వినోబాజీ.

సాయంత్రం ముగ్గురన్నదమ్ములు తల్లిదగ్గర కూర్చుని వినోబాజీమాట వినిపించినారు. వారిదగ్గర పంధొమ్మిది వందల ఎకరాలభూమి ఉండెను. 'బాబా అన్నది నిజమే నాయనా' అన్నది తల్లి : 'వారికి నాలుగోభాగం, జ్యేష్ఠ సోదరుని భాగం లభించవలసిందే.' ముగ్గురన్నదమ్ములు వినోబాజీకి అయిదువందల యెకరాల దానపత్రము యిచ్చి బాబా స్నేహబంధము చేత బంధితులైనారు.

౧౪

# భూమిలేకున్నా మాకు గడుస్తుంది

ఢిల్లీకి ముందు గాజియాబాదులో మకాం. అక్కడ బ్రహ్మాండంగా సభ జరిగింది. దానంకూడా బాగానే దొరికింది. రాత్రి బాబా స్వాధ్యాయంలో ఉన్నప్పుడు ఒక సోదరీమణి

వచ్చింది. బాబా దర్బారు అందరికీ తెరిచే ఉంటుంది. ఆ సోదరి బాబాకు ప్రణామం చేసి, 'నా భర్త వకీలు (ప్లీడరు). మాకు వచ్చే ఆదాయంతో మా జీవితం చక్కగా గడిచిపోతుంది. పదకొండు యెకరాల భూమికూడా మాదగ్గర ఉన్నది. ఎప్పటికైనా పనికి వస్తుందని సమకూర్చుకున్నాము. అదిలేకున్నా మాకు గడుస్తుంది. మీరు ఈ పదకొండు యెకరాల దానపత్రాన్ని స్వీకరించండి' అని అన్నదామె.

దానపత్రమిచ్చి 'గీతాప్రవచనము' ప్రసాదంగా తీసికొని ఆమె వెళ్లిపోయింది.

౧౨

## రాష్ట్రపతి ఆశీర్వాదం

రాజఘాట్ దగ్గర వినోబాజీ ప్రసంగించిన మొట్టమొదటి సభ అది. రాష్ట్రపతి వినోబాజీకి స్వాగతమిచ్చినారు. దేశమంతటి తరఫున వారా స్వాగత మొసగినారు. తర్వాత రాష్ట్రపతి స్వయంగా తమతరఫున భూదానయజ్ఞంలో తమభాగాన్నికూడా సమర్పించినారు. 'వినోబాజీ, నా దగ్గర భూమిలేదు. పిల్లలదగ్గర ఉన్నది. అందులోనుంచి మీ కెంత, ఎటువంటిది కావలెనో దయచేసి తీసుకోగలరు' అని రాష్ట్రపతి ఎంతో వినయంగా అన్నారు.

రాష్ట్రపతి ఆశీర్వాదం మొత్తం దేశంతరఫున ఇవ్వబడినదే కదా!

൧൭

# కేవలం నాలుగోభాగమే

రాజఘాట్ దగ్గర వినోబాజీని కలుసుకోవడానికి మధ్య ప్రదేశ్ నుంచి ఒక గృహస్థు శ్రీ పాలీవాల్‌జీ తమ సహధర్మ చారిణితో వచ్చినారు.

తమకున్న మొత్తం భూమి నలభై ఎనిమిది యకరాల దానపత్రం వినోబాజీ పాదాలమీద పెట్టినారు. తత్సంబంధమైన కాగితాలు, నక్షాలు అవన్నీ వెంట తెచ్చియుండిరి.

వినోబాజీ వారి ధర్మపత్నిని పిలిచి అడిగినారు. ఆమె కూడా తన అంగీకారం తెలిపింది.

'మీ కెంతమంది పిల్లలు ?' వినోబా అడిగినారు.

'ముగ్గురు మగపిల్లలు.'

'జీవికానిర్వహణకు భూమిగాక ఇంకేమైనా ఉన్నదా ?'

'లేదండి.'

'అయితే నాకు నాలుగోభాగం పన్నెండెకరాల దాన పత్రం వ్రాసియివ్వండి. మిగిలినది ప్రసాదరూపంగా తీసుకోండి.'

ఆ దంపతులు ఆ ప్రసాదమును స్వీకరించి బాబా ఆశీర్వాద మును పొంది వెళ్లిపోయినారు.

౧౭

# సర్వస్వ సమర్పణము

కరహాల్ అనేది ఒక కుగ్రామం. అక్కడి కార్యక్రమమంతా ఇదివరకే నిర్ణయింపబడియుండెను. అక్కడ ఒక సోదరుడు తమ మొత్తం భూమి నాలుగెకరాలు దానమిచ్చినాడు. దానిచేత ప్రేరితులై ముంపు అయిదెకరాలు ఇవ్వ నిశ్చయించుకున్నవా రొకరు పది యెకరాలు వ్రాసియిచ్చినారు. మరొకరు పదకొండు యెకరాలు ఇవ్వదలచియుండిరి కాని తర్వాత ఇరవై యెకరా లిచ్చినారు. సాయంత్రం భోజనంచేసి వస్తుంటే ఒక సోదరుడు కలిసినాడు. ఆయన వినోబాజీ ప్రవచనం వినలేకపోయినాడు. అయినా దానమివ్వాలన్న సంకల్పం మాత్రం అతనికుండినది. అతడు కొట్టు మూసేసి వస్తూవుండెను. మేము వారి కొట్టు ముందుకు వెళ్లినాము. బహీఖాతా తీసి భూమి హద్దు చూపి మొత్తం భూమి పది యెకరాలు దానపత్రం వ్రాసియిచ్చినాడు. ఈచిన్న పల్లెటూళ్ళో ౬౦ - ౬౨ యెకరాలభూమి లభించింది.

౧౮

# దాతకు ప్రసాదం

ఇటావా జిల్లాబోర్డు అధ్యక్షులు ఠాకూర్ రఘునాథ సింహ జిల్లా సాంతం పర్యటనలో మావెంట వున్నారు. గాంధీ పుణ్యదివసంనాడు ఇటావాలో వినోబా ప్రార్థన ప్రవచనం పరి

సమాప్తం కాగానే రఘునాథసింహా మాట్లాడటానికి లేచి నిలుచున్నారు. కాని అతికష్టంగా మాట్లాడగలిగినారు. అతని కళ్ళల్లో నుండి అశ్రుధార ప్రవహించ నారంభించింది. 'వినోబాజీ, మేమిద్దర మన్నదమ్ములము. మాకు పదిఏకరాల భూమి ఉన్నది. అదిమొత్తం మీకు సమర్పిస్తున్నాను. మాఉదరపోషణకై మీకెంత ఉచితమనితోస్తే అంత ప్రసాద రూపేణా యివ్వండి' అన్నారు.

౧౯

# హృదయ పరివర్తన

నెమ్మది నెమ్మదిగా అన్ని భావములకు చెందినవారుకూడా భూదానతత్వమును విశ్వసింపనారంభించినారు. సమాజవాదులు (సోషలిస్టులు), కాంగ్రెసు సోదరులు సహకరిస్తున్నారు. 'వినోబాజీ! మీరు మేము చేయవలసిన పని చేస్తున్నారే' అని కూడా కొందరన్నారు.

బలియా జిల్లాలో కమ్యూనిస్టు మిత్రులు పూజ్య వినోబాజీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినారు. ఆజంగఢ్‌లో సమర్పించిన సన్మానపత్రంలో వారిట్లన్నారు: 'మాకు మీ మార్గంతో ఏకాభిప్రాయం లేదు. ఐనా మీరు మీ మార్గాన్ని ప్రయోగించి చూచుకొనవచ్చును. మేము ఆటంకాలు కలిగింపము.'

మైన్‌పురి జిల్లాలో ఒక అడుగు ముందుకు వేసినారు. జలపానం కొరకు బాబా ఒక ఊళ్ళో నిలిచియుండినారు. జిల్లా కమ్యూనిస్టు నాయకులు శ్రీ బాబూలాల్‌జీ పాలీవాల్ తమ

గ్రామీణ స్నేహితులతో బాబా దర్శనం కోరకు అక్కడికి చేరు కొన్నారు. ఎంతో నమ్రతతో వారు తమ రెండెకరాల దాన పత్రం స్వీకరించవలసిందని ప్రార్థించి ముందు సహాయం చేయ గలమని విశ్వాసం కూడా కలిగించినారు.

ఈ విధంగా ముందు విరోధము. పిమ్మట సన్మానపత్ర ములు. తర్వాత దానపత్రములు కూడా యిచ్చినారు కమ్యూ నిస్టు మిత్రులు.

## ౨౦

# దక్షిణంనుంచి ప్రథమ సమర్పణ

తంతి, తపాలా ద్వారా కూడా దానపత్రాలు రావటం ప్రారంభమైనది. బెంగుళూరునుండి ఒకముస్లిం సోదరుడు జనాబ్ సయ్యద్ హుసేన్‌గారు తమ వేయి యకరాల దానపత్రాన్ని పూజ్య రాజేంద్రబాబు పేర వారి జన్మదినం నాడు "వినోబాజీకి ఉత్తర భారతదేశంలోనే భూమి దొరుకుతున్నది; దక్షిణంలో కూడా భూదాన మారంభించే దృష్టితో ఈ దానపత్రమును వినోబాజీ స్వీకరించగలరు" అని వ్రాసిపంపినారు.

## ౨౧

# పంజాబ్ ప్రాయశ్చిత్తం

ఒకరోజు జలేశ్వర్ జీ ఒక సోదరుని తీసికొని గదిలోనికి వచ్చినారు. ఆ సోదరుడు ఎంతో నమ్రతతో ఒక దస్తావేజు వినో

బాజీ ముందు ఉంచినాడు. రెండువందల యెకరాల దానపత్ర మది. అతను హిసార్ నుంచి ఇక్కడికి భూదానం యివ్వటానికి వచ్చినాడు.

'మీరు పంజాబ్ దయచేయండి. పదివేల ఎకరాల భూమి మీకు సమర్పించ దలచుకున్నాను. భూదానం అడగటానికి వెళ్ళ టానికి ముందు నేను స్వయంగా నా తరఫున ఇవ్వవలసి వున్నది. ఒకమాసం పూర్వమే నాకు ఈ భూమి లభించింది. దీనిని ఏదైనా సత్కార్యం కొరకు ఉపయోగించే ఆలోచనలో ఉంటిని. బాగా ఆలోచించిన తర్వాత భూదానంకన్నా మరొక మంచిపని నాకు కనిపించలేదు. కాబట్టి ఈ భూమి మొత్తం మీకు సమర్పించ డానికి వచ్చినాను' అని ఆ సోదరుడన్నాడు.

ఒకప్పుడు పంజాబు ప్రభుత్వము పశ్చిమ పంజాబు నుంచి తూర్పు పంజాబులోకి వచ్చిన నిర్వాసితులైన హరిజనుల కోసం భూమి యివ్వగలమని శ్రీమతి రామేశ్వరీ నెహ్రూ, శ్రీ వినో బాజీలకు వాగ్దానం చేసింది. పట్టికలు తయారైనవి. రాజఘాట్ దగ్గర వినోబాజీ పంజాబ్ ప్రభుత్వమును అభినందించినారుకూడా. కాని ఏకారణం వల్లనో పంజాబ్ ప్రభుత్వం ఆ వాగ్దానాన్ని పూర్తిచేయలేకపోయింది. ఆ సంఘటన వినోబాజీ, రామేశ్వరీ గారల హృదయాలను గాయపరచింది. అయినా భగవంతుడు ఏదో మార్గం చూపించగలడని వినోబా విశ్వసించి యుండినారు.

ప్రభుత్వం పూర్తిచేస్తామన్న వాగ్దానంలో ఇది ఒక అంశం మాత్రమే అవునుగాక, అయినా ఈ పంజాబు సోదరుడు ప్రభు త్వానికి ప్రాయశ్చిత్తమే చేసినాడు.

## ౨౨

# రెండు బీఘాలు రెండులక్షల సమానము

బరహాజ్ వెళ్లుతూ మా తోటి యాత్రికులైన శ్రీ హరీశ్ భాయీ గ్రామానికి వినోబా వెళ్లినారు. గ్రామ మహిళలు మంగళ గీతాలు పాడినారు. హారతులివ్వటం జరిగింది. హరీశ్ భాయి తల్లి ముందుకు వచ్చి ప్రణామ మాచరించింది. తర్వాత ఆమె ఏమో చెప్పవలె ననుకొన్నది. కాని ఆమె కంఠం రుద్ధమై పోయింది. 'ఏం, ఏమైనా చెప్పవలసింది ఉన్నదా ?' ఆమెనుచూసి వినోబా ప్రశ్నించినారు.

ఆమె నెమ్మదిగా తేరుకొని, 'మొత్తం పన్నెండు బీఘాల భూమి ఉన్నది. ఇంట్లో అయిదుగురున్నారు. మీరు దయచేసి మిగిలిన రెండు బీఘాలభూమిని తీసుకోండి' అన్నది.

సాయంత్రం ప్రార్థనా ప్రవచనంలో, 'నాకు ఈ రెండు బీఘాలు రెండులక్షల బీఘాలతో సమానమైనవి. ఈదానం నేను చేస్తున్న పనికి ఆమె ఇచ్చిన ఆశీర్వాదంగా భావిస్తున్నాను' అన్నారు వినోబాజీ.

## ౨౩

# 'ఏమని అడుగను ?'

గోరఖ్‌పూర్ తర్వాతి మజిలీకి వెళుతున్న సమయంలో మా సామానుబండితో పాటు ఒక హరిజన సోదరుడు నడుస్తూ

ఉండెను. అతడు బండికి దారిచూపిస్తూ ఉండినాడు. అతను ఎంతో బిడియపడుతూ మరొక సోదరునితో ఇట్లన్నాడు. 'ఏమిండీ, నేనుకూడా భూదానం చేయవచ్చునా? అంతాకలిసి మా ఇంట్లో పన్నెండుగుర మున్నాము. భూమి అయిదు బీఘా లున్నది. కూలిచేయనిది ఎవ్వరికీ పొట్టగడపదు. కాబట్టి ఈభూమి ఇచ్చివేయవలెననుకుంటున్నాను. కాని ఒకటి, రెండు బీఘాలు ఎట్లా ఇవ్వడమా అని మనస్సు సంకోచిస్తున్నది. ఇంత తక్కువగా యిస్తే బాగుండదేమోననిపిస్తున్నది. ఏమి తోచడంలేదు. ఏం చెయ్యాలో మీరేమైనా సలహాచెప్పండి.'

పాపం వారేం జవాబుచెప్తారు! హరిజన సోదరుని పాదాలకు నమస్కరించినారు. ఉదారత్వంతో నిండిన తపోరాశి యైన భారతదేశమిది. బాబా ఆ సోదరుణ్ణి సంతృప్తిపరచడానికి కొన్ని సెంట్లభూమి మాత్రమే తీసికొన్నారు. నూతన మార్గ దర్శకమైన ఈ దానాన్ని గురించి వారు బండితోలేవానికి చెప్పి నారు. 'నేనుకూడా దానపత్రం వ్రాసియిస్తాను' అని వెంటనే బండిమనిషి అన్నాడు. ప్రేమపూర్వకంగా అతనికున్న ఒక ఎకరం భూమిలోంచి ఒక సెంటు దానపత్రం వ్రాసియిచ్చినాడు.

— ౨౫

# నీది నీకే సమర్పిస్తాను

ఫరైందాలో మా తోటియాత్రికుడు గౌతం బజాజ్ మంగ్రూ అనే ఒక సోదరుణ్ని వినోబాజీ దగ్గరికి తీసుకువచ్చినారు.

వినోబాజీ గదిలో వారితో కలవదలచుకొన్న వారంతా నిండి యున్నారు. వారిలో కొందరు భూస్వాములు, కొందరు ధనవంతులు, మరికొందరు మిల్లుయజమానులు ఉంటినారు. 'బాబా, ఈయన దగ్గర కేవలం ఇరవై ఒక్క సెంట్లభూమిమాత్రమేఉన్నదట ఆ ఉన్నదికాస్తా దానమిస్తానంటున్నాడు.' అని గౌతం బాబాతో విన్నవించినారు. సర్వస్వం సమర్పించడానికి సంసిద్ధుడైన ఆ మహాదాతను వినోబాజీ సాదరంగా తిలకించినారు. ఆ సోదరుడు వినోబాజీ పాదాలకు నమస్కరించి 'నా యీ స్వల్పదానాన్ని స్వీకరించండి మహాత్మా' అని వేడుకొన్నాడు.

'అయితే మరి నీకింకేమీ మిగలదుకదా' అన్నారువినోబా.

'కార్ఖానాలో నా కెట్లాగూ పనిచేయవలసే ఉంటుంది. ఈ కాస్తభూమివల్ల నాకు గడువదు. ఇంట్లో అయిదారుగురు ఉన్నారు' అన్నాడు.

'నీవు ఇవ్వదలచుకున్నావు, బాగానేవుంది. కాని ఇది నీదగ్గరే ఉంచుకో' అన్నారు వినోబాజీ. అతను ఒప్పుకోలేదు. వినోబాజీ బలవంతపరిచేప్పటికి అతను ఏడవడం ప్రారంభించినాడు. ఆఖరుకు వినోబాజీ దానము స్వీకరించి దానిపై ఇలా వ్రాసినారు. 'ఈ వ్యక్తి ఇంటిపరిస్థితిని చూసి ఈ భూమి ప్రసాదరూపంగా అతనికే తిరిగి ఇవ్వవలసియున్నది. అతని ప్రగాఢవాంఛను కాదనలేక మేమిది తీసుకున్నాము.'

మంగ్రూ పారవశ్యంతో తిరిగి వినోబాజీకి ప్రణమిల్లి ఆ దానపత్రాన్ని తీసికొన్నాడు. ఈ సంఘటన అక్కడున్న అందరి హృదయాలను కదిలించివేసింది.

# భూమి అంతా గోపాలునిదే

మంగ్‌రౌత్ హామీర్‌పూర్ జిల్లాలోగల పురుషార్థి గ్రామం. ఇప్పటివరకూ ఏ జాతీయ ఉద్యమంలోనూ అది వెనుక బడి యుండలేదు. మరి ఈ భూదాన ఉద్యమంలో మాత్రం ఆ గ్రామం ఎట్లా వెనుకబడి ఉండగలుగుతుంది!! వినోబా ఆ గ్రామంలోకి ఇంకా చేరనేలేదు. ఊరి పొలిమేర ఇంకా రెండు మైళ్లుండగానే ఆ గ్రామస్థులంతా వినోబాజీ దర్శనం కోసం చేరుకున్నారు. రామచంద్ర భగవానునికి కోల కిరాతకులు పత్రం పుష్పం సమర్పించినట్లే వారంతా ౧౦౧ యెకరాల దాన సంక ల్పంతో భక్త్యంజలి ఘటించి నిలబడినారు. వినోబాజీ అది స్వీక రిస్తూ ఆలోచిస్తూ ఇలా అన్నారు: 'సబై భూమి గోపాల్‌కీ— భూమి అంతా గోపాలునిది. నాకు కొద్దికొద్దిగా ఎందుకిస్తారు? గ్రామంలోని భూమిఅంతా గ్రామపర మెందుకు చేయరాదు?'

గుట్టలు, రాళ్ళమయంగాను ఉన్న ఆ త్రోవ పువ్వులు, ఆకులు, కొమ్మలు మొదలగు వాటితోనూ, రంగవల్లులతోనూ చక్కగా అలంకరించబడిఉన్నది. బాబా త్రోవచూస్తూ ముందుకు నడుస్తున్నారు. గ్రామస్థులు తమ గ్రామానికి వెళ్ళి ఏమిటి చేయ డమా అన్న ఆలోచన ప్రారంభించినారు. దివాన్ శత్రుఘ్నసింహాజీ ధన మాన ప్రాణాలను కూడా సరకుచేయక దీక్షతో ఆ గ్రామా నికి సేవచేసినవారు. ఆయన మాతోపాటు ముందుమజిలీకి వచ్చి యుండిరి. గ్రామవాసులనుండి వారికి పిలుపు వచ్చింది. వారు

పదకొండు గంటలకు యింటికి చేరుకొనేసరికి అక్కడ గ్రామస్థు లంతా ఎదురు చూస్తున్నారు. గ్రామస్థులు తమ ఆలోచనను దివాన్‌జీకి తెలిపినారు. వారూ అదే కోరుతూ ఉండినారు. దాన పత్రాలు వ్రాయబడినవి. అందరి తరఫున ఒక అధికార పత్రము వినోబాజీ సన్నిధిలో సమర్పించడానికిగాను దివాన్‌జీకి ఇవ్వ బడింది.

ఈనాడు మంగ్‌రౌత్‌లో భూమి లేనివారొక్కరూ లేరు. 'యాచకులంతా అయాచకులైనారు.' గ్రామాన్ని ఆదర్శవంతంగా రూపొందించడానికి వినోబాజీ మార్గదర్శకత్వంలో పని ప్రారంభ మైనది. దూరదూరంనుంచి, విదేశాలనుంచికూడా మంగ్‌రౌత్ వాసులను చూడటానికి వస్తున్నారు.

ఆ రోజునుంచి వినోబాజీ మంగ్‌రౌత్ గ్రామాన్ని స్మరిం చని సభలేదు. 'మంగ్‌రౌత్ ఏమైనా గంధర్వులు, కిన్నెరులూ ఉండే ఊరా? అక్కడ మరోరకమైన మనుషు లుంటున్నారా? అని మీరు అనుకోనక్కరలేదు. అక్కడా మనలాంటివాళ్ళే ఉండేది. అయితే అక్కడ ఒక సేవకు డున్నాడు. అక్కడి ప్రజల పైన అతని ప్రభావం హత్తుకోనడంవల్ల అది ఆదర్శగ్రామమైంది' అని వినోబాజీ ప్రతిచోట చెప్పుతుంటారు.

## —౨౭—

# భూమిలేనివారెవరూ లేరు

జోన్పూరు జిల్లాలో ఒక మజిలీలో క్రొత్త అనుభవం కలిగింది. మా మజిలీకి నాలుగు మైళ్ళదూరంలో 'టకార్డి' అనే

ఊరు ఉన్నది. వినోబాజీ అక్కడికి వెళ్ళలేదు. కాని కార్యకర్తలు వినోబాజీ భావాలను ఆ గ్రామస్థులకు నచ్చజెప్పినారు.

ముప్పైరెండు ఇండ్లున్న ఆగ్రామములో ఇరవైమంది భూమిగలవారు, మిగతా పన్నెండుగురు భూమి లేనివారు ఉన్నారు. భూమిలేని తమ సోదరులకు భూమి ఇవ్వాలన్న విషయం వారికి నచ్చచెప్పబడిన తర్వాత భూమి గలవాళ్ళంతా కలిసి లేనివారి కోసంగాను ముప్పైయేడు యెకరాల భూమిని సేకరించి యిచ్చినారు. ఇప్పుడు ఆ ఊళ్ళో భూమి లేనివా రెవరూ లేరు.

ఊరేగింపుగా బయల్దేరి వారంతా వినోబాజీని కలుసు కోవడానికి వచ్చినారు. వినోబాజీ వారికేమీ చెప్పవలసిన అవస రమే కలుగలేదు. కార్యకర్తలు సరియైన పద్ధతిలో తత్త్వాన్ని నచ్చజెప్పినట్లయితే ఎంతపని జరుగుతుందో తెలుసుకోనడానికి ఇది ఒక ఉదాహరణ.

౨౭

# కుచేలుని అటుకులు

రాత్రి ఎనిమిది గంటలైంది. విశ్రాంతి సన్నాహాలుజరుగు తున్నాయి. ఇంతలో ఒక రైతు వణుకుతూ వినోబాజీ దగ్గరికి చేరుకున్నాడు. సంకోచిస్తూనే మోకరిల్లినాడు. వినోబాజీ అతని వైపు చూసినారు.

'మహాత్మా, నేను మీ సభలోకి రాలేకపోయాను' అంటూ అతను చేతులు జోడించి ఇంకేమో చెప్పబోయినాడు. కాని అతని మనస్సులో వున్న సంకోచమేదో చెప్పనీయలేదు.

'ఎక్కడుంటావు?' అని వినోబాజీ స్నేహభావంతో ప్రశ్నించినారు.

'ఇక్కడికి అయిదుమైళ్ళ దూరాన ఉన్న ఒకఊళ్ళో.'

'ఏం చేస్తుంటావు?'

'రైతును, బాబా'

'అయితే పేదవానికోసం ఏమైనా తెచ్చినావా?'

'అవును మహాత్మా, నా దగ్గర ఏడు బీఘాల భూమి ఉన్నది. రెండు బీఘాలు ఇవ్వాలని వచ్చినాను.'

౨౮

# భూదానయజ్ఞంవల్ల ఎవరూ పేదవారు గారు

'అమేఠీ' సుల్తాన్‌పూర్ జిల్లాలో ఒక సంస్థానం. ఇక్కడి సంస్థానాధీశుడైన రాణారణంజయసింహ పూర్వులువేయిసంవత్స రాల క్రితం ఇక్కడికి వచ్చియుండిరి. వీరు ఆమెర్ (జయపూర్) రాజవంశీయులు. సంస్థానంలో మొదట మూడువందల ఇరవై యారు గ్రామాలుండేవి. అందులో ఇరవైయారు ఊళ్లు సార్వ జనిక కార్యాల కోసం రాణా ట్రస్టుగా తయారుచేసినారు. ఇప్పుడు వారికి మూడువందల ఊళ్లు మాత్రమే ఉన్నాయి.

జిల్లాలో మొత్తం ఇరవైయైదు వందల గ్రామాలున్నాయి. 'మిమ్మల్ని మూడువందల గ్రామాల రాణాను చేయదలచుకో లేదు. జిల్లాలో ఉన్న మొత్తం ఇరవైయైదు వందలకు రాణా గావలె మీరు' అని వినోబాజీ వారితో అన్నారు.

రాణా స్వయంగా విద్వాంసులు. సంస్కృతం చక్కగా అధ్యయనం చేసినవారు. నిత్యం వేదపఠనం చేస్తారు. నిర్వ్యసనులు. మధుమాంసాల సేవన మటుంచి తాంబూలంకూడా వేసుకోరు. భావనాశీలురు; భక్తహృదయులు. వారికి నిజమైన రాణా కావటానికి ఉపాయం చెప్పుతూ వినోబాజీ ఇట్లన్నారు: 'మీరు అధికాధికంగా దానమియ్యండి. భిక్షాపాత్ర తీసికొని బయల్దేరండి. ఏ కులంలో ఏ గుణాలుంటాయో వాటి ప్రభావం ఆ కులం పైన ఉంటుంది. రాజ్యం పోతున్నదన్న విచారం అక్కరలేదు. కొడుకు వ్యవహారాలను సంబాళించుకొనే స్థితికి రాగానే తండ్రి తన సర్వస్వం కొడుక్కు అప్పగిస్తాడు. లోకప్రియులైన ప్రాచీన రాజులు తమ ప్రజల్ని పుత్రులుగానూ, తమను లోకసేవకులుగానూ భావించినారు. మీరుకూడా సేవకులుగా పనిచేస్తే ప్రజల హృదయాలలో ప్రేమస్థానం పొందగల్గుతారు. ఈ భూదాన యజ్ఞ కారణంగా ఏ వ్యక్తి కూడా 'పేదవాడు కాడు. పేదవాడు కానీయండి, శ్రీమంతుడు కానీయండి, ఎవరు పరిశ్రమ చేస్తారో వారే శ్రీమంతులవుతారు.'

రాణాజీ తమ తరఫున మొదటి కిస్తుగా రెండువేల యెకరాలు దానమిచ్చినారు. బనారస్ చేరుకున్న తర్వాత వారి తరఫున మరొక వేయి యెకరాల భూమి దానం లభించింది.

# జాగీరు మొత్తం

హిమాచల ప్రదేశానికి చెందిన సుప్రసిద్ధ నిర్మాణ కార్యకర్త పండిత ధర్మదేవ శాస్త్రిగారి ప్రయత్నాల వల్ల వినోబాజీకి మహంత్ శ్రీఉద్ధోదాస్‌జీ (దశాల్నిగ్రామం, రోహడూతాలూకా, మహాసూజిల్లా, హిమాచల ప్రదేశ్) అయిదువేల బీఘాల జాగీర్దారీ దానమిచ్చివేసినారు. అందులో రెండు పూర్తి గ్రామాలున్నవి. ఈ దానంతో హిమాచలప్రదేశ్ అంతటా ఒక క్రొత్త వాతారణ మేర్పడింది. దీనితో భూదానయజ్ఞానికి మంచి ప్రగతి చేకూరింది.

ప్రస్తుతదానానికి సంబంధించి శాస్త్రిగారు వ్రాసిన రెండు ఉత్తరాలు ఈ పవిత్రసంఘటనను స్పష్టంగా చిత్రిస్తున్నాయి.

౧

***పూజ్యా శ్రీ వినోబాజీ,***

నేను నిన్న రోహడూ నుంచి ఆశ్రమానికి కాలినడకను బయలుదేరి వచ్చినాను. నూరుమైళ్ళు కాలినడక యాత్రచేసినా మాకేమాత్రం బడలిక అనిపించలేదు. ఎందుకంటే భూమిదాన యజ్ఞంలో క్రొత్తప్రేరణ కలుగుచున్నది.

ఈశ్వరుడు ఎక్కడ ఏవిధంగా ప్రేరణకలిగిస్తాడో, అతనికే తెలుసు. మహంత్ ఉద్ధోదాస్‌జీకి కలిగిన అంతఃప్రేరణ, అదీ ౧౧ సెప్టెంబరునాడు కలిగింది. ఈశ్వరుని పైన అవిశ్వాసం గల

వారికి సవాలు. మహంత్‌జీ వయస్సు కేవలం ౨౮ సంవత్సరములు మాత్రమే. ఈ జాగీరు (శ్రీ) రఘునాథ్‌జీ పేర ఉన్నది. వీరే దానికి పూర్తి యజమానులు. ఈ జాగీరులో మొత్తం అయిదువేల బీఘాలభూమి ఉన్నది. అందులో సుమారు రెండు వేల యెకరాలు బంజరు ఉంటుంది. జాగీరు మొత్తంలో వంశ పారంపర్యంగా చేస్తున్న వ్యవసాయదారులు పదిమంది కెక్కువ లేరు. ఎక్కువమంది వ్యవసాయదారులు మూడు సంవత్సరాల 'పట్టా' పైన వ్యవసాయం చేస్తున్నవారే. జాగీరుభూములే కాక లక్షరూపాయల కెక్కువ విలువచేసే పక్కా ఇండ్లున్నాయి. రోహడూలోవున్న ఇల్లు ఎంత పెద్దగా ఉన్నదంటే అందులో ఒక గొప్పసంస్థ నడువగలుగుతుంది. రోహడూ ఎత్తు సుమారు అయిదువేల అడుగులు. ఈ సంస్థానం పావ నదీతీరంలో సురమ్యమైన కొండప్రాంతంలో ఉన్నది. నలువైపులా హిమాలయాల మనోరంజకదృశ్యం కనిపిస్తూ ఉంటుంది.

రోహడూ, హిమాచల్ ప్రదేశ్‌లోగల మహాసూజిల్లాలోని తాలూకా. ఇక్కడ తహసీల్దారు, మెజస్ట్రీటు కార్యాలయాలు, పోలీసుఠాణా, పోస్టాఫీసు, ఇంకా మాధ్యమిక పాఠశాల ఉన్నవి. రోహడూగ్రామం జనాభా అయిదువందలు. కాని చుట్టు ప్రక్కల కొండల్లోవున్న చిన్నచిన్న గ్రామాల మొత్తం జనాభా ఏబదివేలకెక్కువ ఉంటుంది.

మహంత్ ఉద్ధోదాస్‌జీ మీకు తమ జాగీరుసాంతం వ్రాసి యిచ్చినారు. మహంత్‌జీ కేవలం అరవై ఒక్క బీఘాల ఒక బిస్వా భూమి, ఒక ఇల్లు మాత్రం కోరుతున్నాను. ఇవికూడా వారు

మీ ద్వారానే తీసుకోదలచుకొంటున్నారు. ఇది జరుగడం సంభవ మేనని నేను వారితో అన్నాను.

విధేయుడు,
ధర్మదేవశాస్త్రి

౨

ప్రియశ్రీ *భారతీయజీ !

దరిద్రనారాయణునికీ మొత్తంభూమి దొరికింది. 'సర్వస్వం బ్రాహ్మణస్యేయం యత్కించ్చి జగతీతలే'.

ఈ జాగీరుల వితరణ సక్రమంగా జరిగినట్లయితే హిమాచల ప్రదేశ్‌లో ఇటువంటి ఇతర జాగీరులెన్నో దానంగా లభించే పూర్తి అవకాశం ఉన్నది. నేను దానప్రాప్తికై ప్రయత్నశీలుడనై యన్నాను.

నేను రోహడూకు వెళ్ళినప్పుడు మహంత్ ఉద్ధోదాస్‌జీ దానపత్రంమీద సంతకంచేసి, కన్యను అప్పగించి నిశ్చింతులైన మాతాపితరుల మాదిరిగా ఎంతో ప్రసన్నులైనారు. కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం నాటకంలో కణ్వఋషిచేత పలికించినాడు :

అర్థోహి కన్యాపరకీయ ఏవ,
తా మద్య సంప్రేష్య పరిగ్రహీతుః
జాతో మమాయం విశదః ప్రకామం
ప్రత్యర్పితన్యాస ఇవాంతరాత్మా ॥౪-౨౨॥

---

* భారతీయజీ=లక్ష్మీనారాయణ భారతీయ

మహంత్‌జీ స్థితికూడా ఈ విధంగానే ఉండెను. నాకైతే పూజ్య వినోబాజీ కార్యం సాక్షాత్ నారాయణుని కార్యమేనని స్పష్టంగా కనిపిస్తున్నది. ఇది తప్పక జరిగి తీరుతుంది.

స్నేహపాత్రుడు,
ధర్మదేవశాస్త్రి

## ౩౦

# ఆ అంధుడు అంధుడుకాడు

మురాదాబాదు జిల్లాలో చౌధరిపురమనే పేరుతో ఒక చిన్న పల్లెటూరున్నది. చిన్నఊరైనా, పెద్దఊరైనా వినోబా ప్రతి గ్రామంలో ఒకరోజు మకాం చేస్తారు. ఆ ఊళ్ళో కూడా ఒకరోజు మకాం. వంట వగైరాలు కూడ వెంట ఉన్నవారే చేసినారు. ఎప్పటివలెనే సాయంత్రం ప్రార్థన జరిగింది. ప్రవచనమైంది. చుట్టుప్రక్కల గ్రామాలనుండి చాలామంది వచ్చినారు. కాని దానం ఏమంత లభించలేదు. బాబా సరిగ్గా సమయానికి పడుకొన్నారు. అందరూ కూడా ౧౦, ౧౦-౩౦ గంటలకు పడుకున్నారు.

రాత్రి ౧౨ గంటలకు ఎద్దులబండిలో కూర్చొని రామచరణ్ అనే ఒక సోదరుడు వచ్చినాడు. అతని గ్రామంనుండీ కూడా కొంతమంది సభకు వచ్చియుండినారు. ఒక ఫకీరు పేద వాళ్ళకోసం భూములడుగుతూ తిరుగుతున్నాడని వారు తమ గ్రామానికివెళ్ళి చెప్పియుంటారు. అదివిని రామచరణ్‌జీ బండిలో కూర్చుని మమ్మల్ని వెదుక్కొంటూ వెదుక్కొంటూ అక్కడికి

చేరుకున్నాడు. అదృష్టవశాత్తు దానపత్రాలు చూసే సోదరులే ఆ సమయంలో మేల్కొనివున్నారు. రామచరణ్ జీకి రెండు కళ్లూ కనబడేవికావు. దానపత్రం వ్రాసి వారు వెళ్లిపోయినారు.

ఉదయం త్రోవలో ఒకచోట ఆగినప్పుడు వినోబాజీకి రాత్రి ఒక అంధుడు వచ్చి ఏవిధంగా దానపత్రం ఇచ్చివెళ్లినదీ తెలుపబడింది. ఆ సంఘటన వృత్తాంతం విని బాబా కొంతసేపు స్తబ్ధులైనారు. తర్వాత వారన్నారు: 'ఆ అంధుడు అంధుడు కాడు. స్వయంగా పరమేశ్వరుడే మనకు ఆశీర్వాద మివ్వటానికి వచ్చినాడు. అతణ్ణి అంధు డనుకొనేవాళ్ళం మనమే అంధులమని పిలువబడుతాం.'

## ౩౧

# పుణ్యకార్యం నేనుకూడా చేయవలసిందే

ఫిలీభీత్ జిల్లాలో మాధవతాండ సాధారణమైన ఒక పల్లెటూరు. అక్కడ భూమి వర్షాపాతంగా లభించిందంటే నమ్మండి. ఒక సోదరునికి అత్యావసరంగా చేలోకివెళ్ళవలసిన పని కలిగింది. అతడు సభలోకి రాజాలకుండెను. అతడు తన చిన్న తమ్ముణ్ణిపిలిచి తమతరఫున సభలోకివెళ్లి పదియెకరాల దానపత్రం వ్రాయించవలసిందని చెప్పినాడు. అన్నగారి ఆజ్ఞ శిరసావహించి తమ్ముడు వచ్చి దానపత్రం వ్రాయించినాడు. తర్వాత మళ్లీ అన్నాడు. 'అన్నగారి తరఫున దానమిచ్చినాను. అయితే ఇంతటి తోచే వెళ్లిపోతే బాగుండదు. అన్నగారెంత భూమియిచ్చినారో

నేనుకూడా అంత యిస్తాను. పుణ్యకార్యం నేనుకూడా చేయవలసిందే.'

ఈ మాటలు అని ఆయన మరొక దానపత్రం తన పేర వ్రాసియిచ్చినాడు. కరతాళధ్వనులతో ఆపరిసరమంతా మార్మోగిపోయింది.

## ३_२

# వృద్ధమాత వరదానం

విజయపూర్ అనే పేరుగల ఒకపల్లెటూరి సంగతి ఇది. వేదిక అందంగా తయారుచేయబడింది. పొప్పడిపండ్లు, బంగాళదుంపలు, (ఆలుగడ్డ) బెల్లం మొదలైనవాటితో ఫలహారమయింది. జనం బాబాని చుట్టుకొన్నారు. బాబా తప్పనిసరిగా ఆగిపోవలసి వచ్చింది. కొద్దిసేపట్లో తమ భావాల్ని తెలిపి ఉపాహారానికి తీసుకురాబడిన పొప్పడిపండుముక్కల్ని జనానికి యిస్తూ భూమి అడగటం మొదలుపెట్టినారు. 'అరె, తీసుకోండర్రా, ప్రసాదం మీకోసం ఎదురుచూస్తున్నది. ప్రసాదం తీసుకొండి - భూమి ఇవ్వండి' అని మధ్యమధ్య అంటుండేవారు. ఒకముసలితల్లి భక్తిభావంతో ప్రసాదం గ్రహించటానికి వచ్చింది. 'మాతాజీ, మీదగ్గరేమైనా భూమి ఉన్నదా ?'అని అడిగినారు బాబా. 'ఆ, ఉన్నది. ఆరుబీఘాలు' అని సమాధానంచెబుతూ ఆమె మళ్ళీ అందుకొని, 'ప్రతిఒక్కరూ ప్రసాదం స్వీకరించి భూదాన పుణ్యప్రాప్తిని పొందుతున్నారు. నాదొక బీఘా వ్రాసుకోండి' అని ఆమె అంటుంటే ఆమెకళ్లు చెమ్మగిలినాయి. ఆమె బాబా పాదాలకు నమస్క-

రించింది. సాయంత్రం జరిగిన సభలో బాబా ఈ సంఘటనను గురించి చెబుతూ, అది నాకు హరిదర్శనమే అన్నారు. ‘ ఈ యజ్ఞంలో పాల్గొనే భాగ్యం లభించడం భగవదనుగ్రహ మనుకొన్నది ఆ వృద్ధమాత. కాని నాకు మాత్రం ఆ ముసలితల్లి ఆశీర్వాదం దానరూపంగా లభించినట్లే కనిపించినది.

33

## వృద్ధురాలి శ్రద్ధ

నైనీతాల్ జిల్లాసంగతి. కాలాడూంగీ అనే ఒక చిన్న పల్లెటూళ్ళో మా మజిలీ. పల్లెలనుండి వచ్చిన జనం సాయంత్రం తమతమ ఊళ్ళోకి వెళ్ళిపోయినారు. ఒక ఊళ్ళో వృద్ధురాలొకామె బాబా పేదలకోసం భూమి అడుగుతున్నట్టు విన్నది. భూమి కొంత గట్టుమీదా, కొంత తరాయీలోనూ ఉండెను. ఆమె నడిచి పదకొండు గంటలవరకు మజిలీకి చేరుకొన్నది. అంతా పడుకొనివున్నారు. పదకొండు నాలీల తరీభూమి, ఒక ఇల్లు ఈ యజ్ఞంలో సమర్పించడానికి గాను ఆమె రాత్రి నుంచే అక్కడ ఎదురుచూస్తూ కూర్చొని ఉన్నదని తెలిసింది ఉదయం కనుక్కొంటే. నిజంగా భగవంతుని ద్వారంముందర కూర్చున్నట్లే కూర్చున్న దాతల్లి.

అక్కడినుండి బయలుదేరడానికి ముందు ప్రాతఃకాలంలో ఈ ఉద్యమానికి ఆ వృద్ధమాత ఇచ్చిన ఆశీర్వాదమే అది.

౩౪

# వీరబాలకుని దానం

'దరిద్రనారాయణుని కోసం – ఈ యజ్ఞంలో ఎవరైనా దానం చేసేవారున్నారా?' అని ఒక సభలో వినోబాజీ విజ్ఞప్తి చేసినారు. నాలుగైదు నిమిషాలపాటు సభ పూర్తిగా నిశ్శబ్దమైపోయింది. అందరూ ఒకరి ముఖం ఒకరు చూసుకుంటున్నారు. ఇంతలో ౧౦, ౧౨ సంవత్సరాల బాలకుడొకడు లేచి నిలుచున్నాడు. అందరూ ఆ బాలుని వైపు కుతూహలంతో చూడనారంభించినారు. ఆ పిల్లవాని నోటినుండి ఏంమాటలు వెలువడుతాయో విందామని అందరి చెవులూ వాటంతటవే ఆతురతతో ఎదురుచూస్తున్నాయి. 'నా భాగానికి పది యెకరాల భూమి వస్తుంది. నా పాలు భూమి మొత్తం సమర్పిస్తున్నాను' అన్నాడా బాలుడు. ఇంకా దానప్రక్రియ పూర్తికాలేదు. 'మీ నాన్నగారు అనుమతించినారా?' అని వినోబాజీ అడిగినారు. ఆ పిల్లవానికి తండ్రి లేకుండెను. తల్లి ఇంట్లో ఉండినది. సభానంతరం తల్లివచ్చి కొడుకు చేసిన దానాన్ని ధ్రువపరచింది.

౩౫

# పేదవానికే పేదవాని బాధ తెలుస్తుంది

వింధ్యప్రదేశ్- సంగతి. ఇద్దరన్నదమ్ముల దగ్గర మూడు యెకరాల భూమి ఉండెను. బాబా విజ్ఞప్తిపైన వారు కూడా అర యెకరం దానమిచ్చినారు.

'పేదవాని బాధ పేదవానికే తెలుస్తుంది కాబట్టి అతడు సహజంగా, ఉదారంగా త్యాగంచేస్తాడు.'

## ౩౬

# అవ్యక్తమైన ప్రభావం

'సురభి' సభలో ఆరుమైళ్ళ దూరమున్న గ్రామంనుంచి ఒక సోదరుడు భూమినివ్వటానికి వచ్చినాడు. అతడు బాబా ఉపన్యాసం వినజాలకుండెను. ప్రార్థనలోనూ పాల్గొనలేకుండెను. చేనిలో పనిచేస్తున్నప్పుడు సురభికి భూమిదానం స్వీకరించటానికి ఒక బాబా వచ్చినారని తెలిసిం దతనికి. చేతిలోపని వదలిపెట్టి ఆరు ఎకరాలలోంచి ఒక ఎకరం దానం వ్రాయించి వెళ్ళిపోయినాడు. ఇంతలో మరొక సోదరుడు వచ్చి నలభై మూడు ఎకరాలు దానమిచ్చి వెళ్ళిపోయినాడు. బాబా ప్రవచనం విన్నవారి దగ్గర నాలుగు ఎకరాల భూమి లభించింది. ఏమీవినని వారినుండి నలభై నాలుగు ఎకరాల దానం లభించింది. అందుకే వినోబా తరచు అంటుంటారు: 'వ్యక్తంకన్నా అవ్యక్తంయొక్క ప్రభావ మెక్కువగా ఉంటుం' దని.

## ౩౭

# నెహ్రూజీ జన్మదినోత్సవంనాడు

పోస్టులో ఒక దానపత్రం వచ్చింది. పదిసంవత్సరాల పిల్లవాడు నాలుగవ తరగతిలో చదువుకుంటున్నాడు. భూమి

దానసంసంగతి ఆ పిల్లవాడుకూడా విన్నాడు. తండ్రిని ఆ పిల్లవాడడిగినాడు—'మనంకూడా ఏమైనా ఇవ్వాల'ని. తండ్రికికూడా ఇవ్వాలన్న అభిలాష కలిగింది. పిల్లవాడు జవాహర్లాల్ నెహ్రూ జన్మదినోత్సవంనాడు ౨౧ యెకరాల భూమి దానపత్రం వ్రాసి పంపినాడు. ఆ దానపత్రం పండిత నెహ్రూ పోస్టుద్వారా వినోబాజీకి పంపించినారు.

# ౩౮

# విశ్వనాథ భగవానుని ఆశీర్వాదము

సర్వోదయ సమ్మేళనంకొరకుగాను సేవాపురి చేరడానికి ముందు బనారస్‌లో మజిలీ ఉండెను. అప్పటికి భూదానయజ్ఞం ప్రారంభమై ఒక సంవత్సరం కావచ్చింది. ఒక సంవత్సరంలో లక్ష యెకరాలదాకా భూమిసేకరణ జరుగగలదని వినోబాజీకి మొదటినుంచే విశ్వాసముండెను.

బనారస్ చేరేవరకు భూదాన సంఖ్య సుమారు తొంభై వేలవరకు వచ్చింది. ఇంతలో కాశీరాజు ఉత్తరం ఒక దూత ద్వారా వచ్చింది. ఉత్తరంలో ఈవిధంగా వ్రాసిఉన్నది.

"ఏ గొప్ప ప్రభావంచేత ప్రేరితులై మీరీ కఠినవ్రతం గైకొని మీ **ఉద్దేశం పూర్తికావడానికి చలి వేడిమి అనకుండా కాలినడకన తిరుగుతున్నారో మాటలతో చెప్పగలగడం అసంభవం. దానికి మీరే మూర్తిస్వరూపులైనారు. మీదర్శన మాత్రంద్వారానే ప్రజలకు దాని వాస్తవిక పరిచయం కలుగుతుంది. మీ శుభాగమనంవల్ల అందరి హృదయాలూ ప్రఫుల్లితములవుతున్నవి. జనసముదాయం సుఖసంతోషాలకోసం భారతీయ**

పరంపరకు అనుకూలమైన ఒక వ్యవస్థ రూపురేఖ దృష్టి గోచర మవు తున్నది.

బాబా, విశ్వనాథ్ అనుగ్రహంవల్ల మీ యీ భగీరథప్రయత్నం సఫలమవునుగాక.

"సర్వేఽపి సుఖినః సంతు, సర్వే సంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు, మా కశ్చి ద్దుఃఖభాగ్ భవేత్."

దీనితోపాటు పదివేల యెకరాల దానపత్రముకూడా ఉండినది. వినోబా క్రిందివిధంగా సమాధానం వ్రాసినారు.

"ప్రేమతో అర్పించిన మీ భూమిదానం లభించింది. దాని పూర్తిని కూడా మీరు చేయనున్నారని సందేశంకూడా మాకు వచ్చింది. మిమ్మల్ని మేము మరొకటి కోరుతున్నాము. మీరు స్వయంగా ఈయజ్ఞంలో దాన మిచ్చినట్లే మీ మిత్రులతోకూడా ఇప్పించండి. ఈ విధంగా ఈకార్యం సహజంగానే ఉత్తరోత్తరా వ్యాప్తిజెందుతూ ఉంటుంది.

మా ప్రయత్నం జయప్రదం కావడానికి బాబా, విశ్వనాథ్‌ను ప్రార్థించినారు. ఇది మీరు నాకుచేసిన గొప్పసహాయం. నా యీ పనివెనుక వారి ప్రేరణే ఉన్నది. వారే ఈ మహాకార్యాన్ని సఫలంచేయగల సమర్థులు. నేను వారి పాదరేణువును మాత్రమే."

౩౯

## పూర్ణాహుతి

భూదాన సంఖ్య సుమారు లక్ష యెకరాలవరకు వచ్చింది. అయినా ఇంకా పూర్ణాహుతికి కొంత మిగిలియుండెను. ఇంతలో పోష్టులో ఒక పత్రం వచ్చింది. అందులో అరవై యెకరాల దానపత్రం ఉన్నది.

గాంగోదా నుండి వినోబాజీ పినతండ్రికొడుకు, ఘూలియా నుండి వినోబాజీ చిన్నతమ్ముడు శివాజీ మహారాజ్ తమ కుటుంబానికి గల మొత్తంభూమి, సుమారు అరవై యెకరాల దానపత్రం పంపించియుండిరి. ఈవిధంగా భూదానయజ్ఞ ప్రథమ సంవత్సరంలో లక్ష యెకరాల మానసిక సంకల్పపూర్తికై అత్యంత పవిత్రమైన ఈ పూర్ణాహుతి లభించింది.

# ౪౦

## వీరనారి

ముఖ్యమంత్రియేగాక ఆ ప్రాంతానికి చెందిన ఇతర నాయకులంతా బలవంతం చేసినప్పటికీ వారు తిరిగి ఎన్నికలకు నిలబడకూడదని నిశ్చయం చేసికొన్నారు. ఈ మధ్యనే పాద యాత్ర జరుగుతూండగా తంతివచ్చింది. ఏదో ముఖ్యమైన పని మీద ఇంటికి రప్పించబడ్డారు. ఇంటికివచ్చి చూస్తే స్నేహితుల గుంపు సిద్ధమై వున్నది. 'మీరు తప్పక ఎన్నికలకు నిలిచితీరవల సిందే'నని అంతా గట్టిగా చెప్పుతున్నారు. 'మీరు కేవలం ఫారం నింపండి. మిగతాదంతా మేము చేసుకుంటాము' అని వారంతా ఒకేవిధంగా బలవంతంచేస్తున్నారు.

అందరిని క్షమించమని వేడుకొని వారు తండ్రిగారిని, ధర్మపత్నిని చూడటానికి ఇంట్లోకి వెళ్లినారు. కొంతమంది సన్ని హితులు వారితోపాటే ఇంట్లోకి ప్రవేశించినారు.

ఒకమిత్రుడు పదివేలరూపాయల చెక్కుతీసియిస్తూ, 'డబ్బు కొరత ఏమైనా ఉన్నట్లయితే ఇదిగో డబ్బు. డబ్బు ఇబ్బందివల్ల

ఎన్నికలలో నిలిచే అభిప్రాయం వదిలినట్లుమాత్రం కాకుండదు. ఇంకేముంది? మేమంతా కలిసి కృషిచేస్తాం' అంటూ వారి తండ్రిగారివంక, వారు తమ వకాలతీ ఏమన్నా చేస్తారేమోనన్న ఆశతో, చూడసాగినారు.

ఎన్నికలలో పోటీ చేయకూడదన్న తన నిశ్చితాభిప్రాయాన్ని తెలిపి ఇంటివాళ్ళ అభిప్రాయం కనుక్కుందా మనుకొని 'మున్నీ తల్లి అభిప్రాయమేమిటి? బాబూజీ అభిప్రాయమేమి' టని అడిగినారువారు. స్నేహితుల పక్షాన బాబూజీ వకాలతీ ప్రారంభించడానికి ముందే వారిధర్మపత్ని గర్జించిపలికింది. 'ఎన్నికలలో నిలువాలనే మక్కువ ఉన్నట్లయితే ముందే ఎందుకు ఆలోచించలేదు? రెండుపనులూ ఒకేసారి జరుగగలుగుతాయా? ఒకప్రాంతం మొత్తం భూదానంయొక్క బాధ్యతవహించినారు. అదేమైనా సామాన్యమైనదా? దరిద్రనారాయణునితో ఈవిధంగా విశ్వాసఘాతుకకృత్యం చేయవచ్చునా? ఇప్పటికి ఎన్నికలలో నిలువజాలనని అందరితో చెప్పివేయండి. భూదానంతప్ప మరొక విషయం ఆలోచించడంకూడా తగదు.'

ఈ సంఘటన సేవాపురి సమ్మేళనానికి పూర్వం జరిగింది. అప్పటికింకా ౧౯౫౭ సం. సంకల్పం జరుగలేదు. భారతనారీమణి చూపిన ఈ త్యాగంచూసి ఎవరు గర్వించరు?

తమ సహధర్మచారిణిపట్ల కరుణ్‌భాయీ హృదయం కృతజ్ఞతాభావంతో నిండిపోయింది.

వారి తండ్రి కొడుకును కోడల్ని ఆశీర్వదించినారు.

## ౪౧

# ఇచ్చినతర్వాత ఇక తిరుగులేదు

బాబాయాత్ర మొట్టమొదటిసారిగా గయా జిల్లాలో జరుగుతున్నది. శేర్ ఘాటీతాలూకు చెందిన ఒక గ్రామంలో ఒక వృద్ధరైతు బాబాను కలుసుకోవడానికి వచ్చినాడు. ఆయన భూదానతత్వంవల్ల ఎంత ప్రభావితుడైనాడంటే తనకుండిన ౬౦ యెకరాల సారవంతమైన భూమి, బావి, ఇల్లు, పళ్ళతోనిండిన ఫలవృక్షాలు, ఆవులు, ఎద్దులు మొదలైన పశుధనం సమస్తం సమర్పించినాడు. నాటినుండి ఆయన బాబా వెంటనే ఉంటూ వచ్చినాడు.

'వెంట ఎన్నాళ్ళుంటారు? ఇంటికెప్పుడు వెళ్ళుతారు' అని మేము వారిని సహజంగానే ప్రశ్నించినాము. 'నేనెప్పుడైనా పోగలను. కాని నేను నా భూమిమీదికి మాత్రం వెళ్ళను. అది నేను అర్పించివేసినాను. బాబాతో ఉండి వారికి సేవ చేయగలుగుతాను' అన్నాడతను.

'పంపకం జరిగేవరకు బాబా తరఫున మీరాభూమిని చూసుకొంటూ ఉండండి. పంపకం అయిన తర్వాత బాబాతో కలిసి కార్యక్రమంలో పాల్గొందురుగాని' అన్నాము. కాని వృద్ధరైతు అందుకు సిద్ధంకాలేదు. 'నేనిచ్చివేశాను. ఇక ఆ వస్తువును ముట్టలేను' అన్నారు.

ఎంత నచ్చజెప్పినా ఒప్పుకోలేదు. ఆఖరుకు వారిని ఆ భూమి బాధ్యతనుండి ముక్తుల్ని చేయవలసివచ్చింది.

౪౨

# విష్ణు సహస్రనామాలు

పలాము జిల్లాలో కమలేశ్వర్ సహాయ్ సింహా (బచ్చూబాబు) ఇంట్లో మకాం. బాబాకు యోగ్యమైనది స్వాగతంలో ఏమిసమర్పించాలో తోచక బచ్చూబాబు ఆలోచనలోఉండినారు. బాబాకు విష్ణు సహస్రనామాలు వినడం ప్రీతియని వారు వినియుండిరి. రెండుమూడువందలమంది దాత లున్నంతమాత్రాన వారు తృప్తిపడరని వారికి తెలుసు. బాబాను ఈవిధంగా సత్కరించడం సముచితం కాగలదని వారికి తోచింది. తర్వాత గట్టిగా కృషిచేసినారు. మొట్టమొదటిసారిగా విష్ణుసహస్రనామాలువారి గ్రామంలో వినిపించబడినవి. ప్రార్థన సభానంతరం వెయ్యిమంది దాతల పేర్లు చదువబడినవి.

బచ్చూబాబు కూడా తమ భూమిలోనుంచి ఆరవభాగం దానంచేసినారు. సంపత్తిలోనుంచికూడా ఆరవభాగ మిచ్చినారు. నాటినుండి ఈ నాటివరకు భూదాన కార్యంలో నిమగ్నులై యున్నారు. పలాము జిల్లా బాధ్యత బాబా వారికే అప్పగించినారు.

౪౩

# సంపూర్ణ దానం

ఆరోజుల్లో బాబా డాల్టన్‌గంజ్ జిల్లా నగర్ ఉంటారీ గ్రామంలో అస్వస్థులైయుండిరి. మధ్యన ఎక్కడా నిలువకుండా

డాల్టన్‌గంజ్ వెళ్ళాలని ఆలోచింపబడుతూ ఉండినది. "రంకా మహారాజు మీకై ఎదురుచూస్తున్నారు. అటునుంచే వెళ్ళరూ?" అని బచ్చూబాబు బాబాతో అన్నారు.

బచ్చూబాబు పట్టుదలచూచి బాబా రంకా వెళ్ళినారు. మహారాజాగారు తాను రచించిన సంస్కృత శ్లోకాలతో బాబాకు స్వాగతం తెలిపినారు. భూదానవిషయం వచ్చింది. 'ఈ దరిద్రనారాయణునికి ఎంతయిస్తారు? అని అడిగినారు బాబా 'ఇప్పటివరకు ఎంతమంది కార్యకర్తలువచ్చి ఎంతెంత అడిగినారో అంతంత వారికి లభించింది. మీరు ఎంత కావలసివస్తే అంత తీసుకోండి' అన్నారు వారు.

'మీదగ్గర ఎంతవున్నది?'

మహారాజుగారు తమ కాగితాలన్నీ బాబాముందు తెచ్చి పెట్టినారు. లక్ష ఎకరాల పట్టా ఉండినది. అందులో సొంత సేద్యంలో పన్నెండువేల యెకరాలున్నవి. పట్టామొత్తం వ్రాసి యివ్వండి అన్నారు బాబా. మహారాజా బాబా అన్నంత వ్రాసి యిచ్చినారు.

సొంత సేద్యంలో నుంచి ఆరవభాగం ఇవ్వండని మళ్ళీ బాబా అన్నారు. మహారాజా అందుకు కూడా ఒప్పుకొన్నారు. రెండువేల యెకరాల దానపత్రం వ్రాసి యిచ్చినారు.

'రాజాగారూ! మీ యీ దానం సంపూర్ణదానం అయినా ఇది మొదటి కిస్తుమాత్రమే. ఇవాళ నేనిది తీసికొని వెళ్ళిపో తున్నాను. కాని మళ్ళీ వస్తాను. ఒక్క భూమిహీనుల కుటుంబం మిగిలివున్నా వస్తూనే ఉంటాను' అన్నారు బాబా.

౪౪

# హృదయ పరివర్తన ఇంకా దేన్నంటారు?

రాంచీజిల్లాలో పాల్కోట సంస్థానాధీశులు లాల్ సాహెబ్ తమ భూమిలోంచి ఆరవభాగం బాబాకు అర్పించి నారు. కాని అంతటితో వినోబాకి సంతృప్తికలుగలేదు. 'మాపని మీరుకూడా చేయటం మొదలుపెట్టాలి' అన్నారు బాబా. రాజా గారు ఒప్పుకున్నారు. జిల్లా భూదానసమితి సంయోజక బాధ్య తనుకూడా వారు అంగీకరించినారు. ఈనాడు వారు గ్రామ గ్రామానికీ తిరిగి దరిద్రనారాయణునికోసం భూదానమడుగు తున్నారు.

హృదయపరివర్తన అంటే సంశయంగల వాళ్ళంతా హృదయపరివర్తన మరింకా దేన్నంటారో ఆలోచించాలిమరి.

౪౫

# దీన్ని స్వకార్యంగా భావించండి

దర్భంగా మహారాజాధిరాజు గంగానది ఒడ్డునగల కురసైలా అనే ఒక చిన్న పల్లెటూళ్ళోకి వచ్చి ఒక లక్షఇరవై వేల యెకరాల భూమి దానంగా బాబా పాదాలకు అర్పితంచేసి వెళ్లి నారు. 'మీరు దానమైతే చేసినారు, బాగానే ఉందికాని ఈ కార్యాన్ని మీరు స్వకార్యంగా భావించాలి' అన్నారుబాబా.

'నావల్ల జరుగగల ప్రతిపనికీ నేను సిద్ధంగా ఉన్నాను' ఎంతో నమ్రతతో అన్నారు రాజాగారు.

# దానవర్షం

చాండిల్‌లో రామగఢ్ మహారాజు ముందు ఒక లక్ష యెకరాలు ఇచ్చియుండిరి. మళ్లీ తమ యాత్రాసందర్భంలో వినోబా వారి గ్రామానికి వచ్చినప్పుడు తమ కుటుంబం మొత్తం తరఫునా వేర్వేరు దానపత్రాల ద్వారా రెండున్నరలక్షల యెకరాలు మళ్లీ వ్రాసి యిచ్చినారు.

ఆరోజుల్లో బాబా ప్రతిరోజు శ్రమదానం చేస్తూవుండే వారు. రాణిగారు తమ నగలుకూడా సమర్పించినారు. ఆరోజు వర్షం జోరుగా కురుస్తున్నది. అంతటి వానలోకూడా తడుస్తూ గంటసేపు వేలాదిజనంతోకలిసి శ్రమదానం చేసినారు వారు.

४౭

# అపూర్వత్యాగం

గయాజిల్లాలో రేవై గ్రామం ఆ పరిసర గ్రామాల్లో తలమానికంగా ఎంచబడుతుంది. వేలసంఖ్యలో ప్రజలు సభకు హాజరైనారు. 'జయప్రకాశ్ జిందాబాద్', 'భూదానయజ్ఞం సఫలం చేస్తాం', 'సంత్ వినోబా అమర్ హో' మొదలైన నినాదాలు మిన్నుముట్టినవి. జయప్రకాశ్‌జీ తమ హృదయాన్ని విప్పి ప్రజలముందు పెట్టినారు. తర్వాత ఆ సౌజన్యమూర్తి దాన మడగటానికి నిలుచున్నాడు. భూమి వర్షంమాదిరిగానే

రావటం ప్రారంభమైంది. వ్రాసేవాళ్లు అలసిపోయినారు. దశరథ్ అనే ఒకవ్యక్తి, భూమికి సంబంధించిన కాగితాలన్నీ తీసుకువచ్చి యుండెను. తనదగ్గర ఉన్నదంతా అర్పించివేసినా రాయన. భూమి, ఇల్లు, ముంగిలి, ఎడ్లు, గేదెలు అన్నికూడా యిచ్చినారు. ఈ దానం ప్రకటన వినగానే సభ అంతా ఆశ్చర్యపడిపోయింది. పెద్దపెట్టున కరతాళ ధ్వనులు చెలరేగినాయి. జయప్రకాశ్‌జీ స్వయంగా పులకితశరీరులైనారు. మొత్తానికి మొత్తం తీసికోవలెనా వద్దా అన్న అనుమానంలో పడ్డారు కొంతసేపు. కాని బాబా ప్రతినిధిగా వారక్కడికి వచ్చియుండిరి. చివరకు దానం తీసుకోవలసివచ్చింది. కాని ఎద్దులు, ఆవులు, గేదెలు, ఇల్లు మొదలైనవి ఉంచేసి కేవలం భూమిమాత్రమే తీసుకొన్నారు.

ఈ భూమి అంతా దశరథ్‌భాయి స్వయంగా చెమటోడ్చి సంపాదించింది. సగం కడుపు మాడ్చుకొని కూర్చుకొన్నది ఈ ఆస్తి అంతా.

## ౪౨

# ఎవరి పుణ్యం వారిదే

మహాకోసల ప్రాంతంలో సేఠ్ గోవింద్‌దాస్‌జీ నాయకత్వంలో ఒక యాత్రాదళం నెలరోజులలో ఆరు జిల్లాలు పర్యటించింది. అక్కడి స్థానిక కార్యకర్తలు ఇతర కార్యక్రమాలేగాక ఈ కొత్తభారం ఎక్కడినుంచి వచ్చిపడిందా అని అయిష్టతతో ఉండిరి. కాని యాత్రలో ఉంటున్నందువల్ల నాలుగైదురోజుల్లోనే

కార్యకర్తల మనస్సు పూర్తిగా మారిపోయింది. బైతూల్ జిల్లాలో ఒక ప్రముఖ కార్యకర్త ముందుకువచ్చి ఇకనుండి భూదాన కార్యక్రమంలో పూర్తిగా లీనంకాగలమనీ, ఆరుమాసాల్లోనే జిల్లా కోటా పూర్తిచేయగలమని సభలో ప్రకటించినారు. ఛిద్వాడా జిల్లాలో గణేశగంజ్ ప్రాథమిక పాఠశాల అధ్యాపకు లొకరు లఖ్నాదాస్ సభలో లేచి, 'సభకు రాకముందు భూదానంలో పాల్గొనాలని నాకు బొత్తిగా ఇష్టంలేకుండినది. కాని ఇప్పుడు నాకున్న మొత్తం ఆరు ఎకరాల పంధొమ్మిది డెసిమళ్ళ భూమి ఇచ్చేస్తున్నాను. వచ్చే వేతనంతో నేను జీవితం గడుపుకుంటాను' అన్నారు.

హోషంగాబాద్, బర్హాన్ జిల్లాలో సభ ముగిసిన తర్వాత కుంవర్ బాయి అని పేరుగల ఒక సోదరి తన మొత్తం రెండెకరాల భూమి దానమిచ్చింది. 'ముందు గడవటం ఎట్లా?' అని 'అడిగితే నేను పాలు, పెరుగు అమ్మి బ్రతుకుతా'నని సమాధానం చెప్పింది.

సివనీలో డా॥ మహేంద్రనాథ్ సింహ దగ్గర ఉన్న ఆరు వందల యెకరాల్లోంచి ఆరవ భాగం వందయెకరాల దానం కోరబడింది. వారు 'వంద యెకరాలు నే నివ్వ' నన్నారు.

'పోనీ, రెండు మూడు ఎకరాలు తక్కువివ్వండి' అంటే 'నేను రెండువందల యెకరాలివ్వా లని నిశ్చయించుకున్నా' నన్నారు వారు.

ఇదేవిధంగా ఒక సభలో ఒక పిల్లవాడు దానమిచ్చినాడు. వెంటనే తండ్రి లేచి నా దానంకూడా వ్రాసుకోం డన్నారు.

పిల్లవాని పుణ్యం పిల్లవానిదే, నాపుణ్యం నాదే అని తెలిపినా డాతండ్రి.

౪౯

# శిబి దధీచులతో సమానమైన దానం

ఒకనాడు గయాజిల్లా అతరీ ఠాణాలోని జేఠియన్ అనే పల్లెటూళ్ళో సభ జరుగుతున్నది. చెపుతూ చెపుతూ జయప్రకాశ్ బాబు హృదయపులోతుల్లోకి వెళ్ళిపోయినారు. ఇరవైమంది దాతలద్వారా నూటఅయిదు దానపత్రాలు వ్రాయబడినవి. 'భగవాన్ బుద్ధుని ఈభూమిలో ఇరవైమంది దాతలే ఉన్నారా?' అన్నారు జయప్రకాశ్‌జీ. నమ్రత మూర్తీభవించిన ఆ మహా వ్యక్తిని యాచిస్తూండగా చూడటంతోనే ప్రజల హృదయాలు కదలిపోయినవి. వర్షపాతంలా భూదానపత్రాలురావడం ప్రారంభ మైనాయి. బాబూ శివధర్‌సింహా లేచి నిలుచున్నారు. 'నావి ఆరున్నర బీఘా' లన్నారు. ఒక కార్యకర్త మెల్లిగా వారి చెవిలో 'ఈయన దగ్గర మొత్తం ఆరున్నర బీఘాలు మాత్రమే ఉన్నది. అంతాయిస్తే ఏమితింటారు?' అని చెప్పినాడు. 'ఆ సోదరునిదగ్గర ఉపాధికి మార్గం మరేమి లేదు. వీరి దానభావాన్ని నేను పరిపూర్ణంగా గౌరవిస్తున్నాను. ఒక బీఘామాత్రం ఉంచు కొని మిగతా అయిదున్నర బీఘాలు వారికే యిచ్చివేస్తున్నాను' అని జయప్రకాశ్ ప్రకటించినారు. బాబూ శివధర్‌సింహా లేచి చేతులు జోడించి, 'అయ్యా! వాపసు చేస్తే నేను ఒప్పుకోను. నాబంట్లో బలమున్నది. ఎక్కడైనా సంపాదించుకొని కడుపు

నింపుకోగలుగుతాను. ఇన్నాళ్ళ ఈభూమివల్ల నేను సుఖం పొందినాను. ఇకనుండి నాబీదసోదరులకు ఆ సుఖం లభించనీయండి' అన్నారు.

జయప్రకాశ్‌జీ స్వరం గద్గదితమయినది. సభికులంతా ముగ్ధులయిపోయినారు. జయప్రకాశ్ ఇలాఅన్నారు: 'నేను మీకు మోకరిల్లుతున్నాను. మీరు శిబి, దధీచి, హరిశ్చంద్రుడు, కర్ణుల కోవకు చెందినవారు. శరీరంలోనుండి మాంసం కోసియిచ్చేవారు. తమ ఎముకలు తీసియిచ్చే దానవీరుల వంశజులు మీరు. వారి రక్తం మీ నర నరాల్లో పారుతున్నది. నేనిది గుర్తింపలేకపోయినాను. దాత అభిప్రాయ మెట్లుంటే అట్లే జరుగుతుంది. నేను దానం స్వీకరిస్తాను.'

## ౨౦

# సంపూర్ణత్యాగం

గయాజిల్లా వజీర్‌గంజ్‌లో మకాం. 'భారతీయ మానవత్వం సాక్షాత్కార మవుతున్నది నేడు. ఆధ్యాత్మికశక్తి నిరూపితం కావడం కన్నులారా చూస్తున్నాము' అన్నారు జయప్రకాశ్‌జీ. ఉపన్యాసంతర్వాత లేచి నిలుచున్నారు. దానగంగ ప్రవహింపనారంభించింది. మొదట కార్యకర్తలు ఇంతవరకు సేకరించిన దానపత్రాలు అర్పించినారు. తర్వాత భాగవత్‌పాండే లేచి మూడు యెకరాల దానసంకల్పం ప్రకటించినారు. మరొక వ్యక్తిలేచి ఇట్లన్నాడు: '౧౯౩౦ సంవత్సరంనుంచి పాండేజీ దేశంకోసం అనేక త్యాగాలు చేసినారు. మూడు బీఘాలభూమి

మాత్రమే వారికున్న మొత్తం ఆస్తి. ఇప్పు డదికూడ దేశానికి ధారవోసినారు. పిల్లలగురించి వారి కేచింతా లేకున్నా మాకు లేకపోలేదు. నేను పాండేటికి నా భూమిలోనుంచి అయిదు బీఘాలు ఇస్తున్నాను.''

## ౨౧
## ఒక సోదరి కలిగించిన ప్రేరణ

నడియాద్‌కు సమీపంలో బోరియావీ అనే ఊరున్నది. ఆ గ్రామానికిచెందినది ఒక సోదరి రవిశంకర్ మహారాజ్ దగ్గరికి చేరుకొని 'మిమ్మల్ని దానకార్యానికిగాను నియుక్తులను చేసినారుగదా. అయితే మరిమీరు దానమడగడానికి తిరుగరెందుకు?' అని అడిగి తనకు దానమివ్వాలన్న సంకల్పమున్నట్లు తెలిపింది. ఆమె చెప్పడంవల్లనే అక్కడ సభ ఏర్పాటుచేయబడింది. భూదాన యజ్ఞతత్త్వమంతా సభలో చెప్పబడింది. ఆసోదరి తనకున్న పద కొండు బీఘాలభూమి దానం చేసింది. ఈ సంఘటన ప్రభావం రవిశంకర్ మహారాజ్ మీద ఎంత పడిందంటే వారు ఆరోజునుంచి భూదాన కార్యంలో పూర్తిగా లీనమైపోయినారు.

## ౨౨
## వృద్ధుని ఇరవై బీఘాల భూమి

మునిసంత్ బాల్‌జీ సోరత్‌లో తిరుగుతూ తిరుగుతూ ఖాబోదర్ సమీపంలోగల ఊరికి వెళ్లినారు. 'మేర్ జాతి వాళ్ళు

ఏమిభూమి యివ్వగలరు?' అనిపించింది వారికి. మా ఊళ్ళో బసచేయండన్నారు 'మేర్' వాళ్లు.

ఊళ్ళో ఒకరు ఒకబీఘా వ్రాసియిచ్చినారు. మరొకరు రెండు బీఘాలు వ్రాసియిచ్చినారు. ఒకరికన్నా ఒకరు ఎక్కువివ్వాలని పోటీ ప్రారంభమైంది. దగ్గరనే ఒక వృద్ధుడు కూర్చునివున్నాడు. 'నావి ఇరవై బీఘాలు వ్రాయం' డన్నా డావృద్ధుడు. రాంభాయ్ పాఠక్ అక్కడే కూర్చొని ఉన్నాడు. ఆయ నిలా అన్నారు. 'ఏమండీ ఇరవై బీఘాలు దానమియ్యడమంటే అర్థం ఏమిటో మీరు గ్రహించే ఇస్తున్నారా లేక ఏమీ తెలియకుండానే ఇస్తున్నారా?' దానికావృద్ధుడు నవ్వుతూ, 'నాకు మీరేం చెబుతారు బాబూ? నేను తినటానికి కూర్చున్నాను. నా ఆకలి చల్లారాలంటే ఒకటిన్నర రొట్టెకావాలె. కాని నా పళ్ళెంలో ఒకరొట్టె మాత్రమే ఉన్నది. ఇంతలో ఆకలిగొన్న మనిషి ఒకడు ఇంటి ముందుకు వచ్చినాడు. ఉన్నదాంట్లోంచి సగం రొట్టెముక్క ఇచ్చినాను. ఇందులో ఇంకా మీరు చెప్పేదేమున్నది నాయనా?' అన్నాడు.

౨౩

## స్వామిత్వ త్యాగం

శ్రీ నారాయణ దేశాయి తమ పంచమహాల్ జిల్లా యాత్రను వర్ణిస్తూ ఈ క్రిందివిధంగా వ్రాసినారు:

'రమణీయా' అనే గ్రామంలో దేశాయి అనే వ్యక్తి ఒకరున్నారు. సాత్విక పురుషులు, సేవాభావంగలవారు. మేము వారి దగ్గరికి వెళ్లినప్పుడు ఎంతో ఆప్యాయంగా, ప్రేమపూర్వకంగా మమ్మల్ని ఆదరించినారు. భూదానానికి సంబంధించిన అనుమానాలు కొన్ని వారి కుండినవి. ఆ అనుమానాలను మేము తగు విధంగా సమాధానాలు చెప్పి తొలగించినాము. వారు తమ ఇరవై ఎనిమిది ఎకరాల్లోంచి ఎనిమిది ఎకరాలభూమి అదివరకే భూదానంలో ఇచ్చియున్నారు. అరవై యెకరాల జాగీరు కూడా ఉండినదివారికి. దాని యాజమాన్యంనుంచి కూడా వైదొలగ వలసిందిగా వారిని కోరడం జరిగింది. వారు ఖాతా తెరిచి ఒక్కొక్క ఖాతాదారు పేరు అతని సేద్యంలోని భూమి వివరాలు చదివి వినిపించ నారంభించారు.

'ఫలానా సోదరుని పరిస్థితి ఎట్లాఉన్నది?' అని నేను మధ్యలో అడిగినాను.

'చాలా పేదవాడు'

'అయితే మీరు అతనిభూమిపైన మీకుగల యాజమాన్యమును వదులుకోవలెను.'

దీనిపైన వారేమాత్రం చర్చించలేదు. దానపత్రంపైన ఆ రైతు భూమి సర్వేనంబరు వ్రాసినారు. ఆ తర్వాత మిగతా పేర్లు చదవబడినవి. మధ్యన మళ్లీ నే నడిగినాను. 'ఈ సోదరుని పరిస్థితి ఎట్లున్నది?' అని.

'ఇతనిది కొంచెం మధ్యమస్థితి' అన్నారాయన.

'ఇతనీ భూమి పైనుంచికూడా మీ యాజమాన్యం తొల గించుకోవడానికి ఇష్టపడతారా?' అన్నాను.

'ఎట్లాగైనా పొయ్యేదాన్ని గౌరవంగా అర్పించడంలోనే మాకు శోభ' అంటూ ఆ భూమికూడా వ్రాసుకోండి అన్నారు దేశాయిజీ. ఈ విధంగా వేర్వేరు ఖాతాదార్ల భూమి కలుపుకొని మొత్తం ఇరవైతొమ్మిదిన్నర యెకరాల భూమి మీదినుంచి తమ యాజమాన్యాన్ని వదులుకున్నారు. వారి మొత్తం భూమిలో ఇది దాదాపు సగం అయింది. వారి ఇంటి వసారాలో కూర్చున్న భిల్లులు మా మాటలు ఎంతో శ్రద్ధగా వింటూవుండినారు. దేశాయిజీ ఒక్కొక్క భూఖండంమీదినుంచి తమ యాజమాన్యమును తొలగించుకొన్నకొద్దీ వారెక్కువగా ప్రభావితులవుతూ ఉండినారు.

## ౫౪

## మహిళలలో కలిగిన చైతన్యం

బక్డాదాజిల్లాలో హరివల్లభ పరీఖ్ భూదానయాత్ర చేస్తూంవుండిరి. రంగ్‌పూర్‌కు ౧౫ మైళ్ళదూరాన, ధారోలీ గ్రామంలో సభ జరుగుతూ ఉండినది. దానస్వీకరణ కార్యక్రమం ముగిసినతర్వాత అక్కడి జమీందారు శ్రీ భీఖూభాయీశాహ్ మరదలు ఒంటిమీదవున్న నగలన్నీ ఒలిచి ఇచ్చివేసింది. 'మళ్లీచేయించరు కదా' అని అడిగితే, 'మళ్లీ చేయించ ననే సంకల్పంతోనే విపత్కారకమైన ఈ సంపత్తిని మీపరం చేస్తున్నా' నన్నదామె. స్త్రీల

మైన మాటలో కూడా చైతన్యం కలిగించని ఆమె సగర్వంగా ప్రకటించింది.

౨౨

# చిన్నవారి హృదయం పెద్దదైయుంటుంది

ఒకరోజు ఉదయం రాధన్‌పూరులో రవిశంకర్ మహారాజ్ పళ్లుతోముకుంటూ కూర్చుని ఉన్నారు. ఇంతలో జేకడా గ్రామానికి చెందిన హీర్‌జీభగత్ వారిదగ్గరికివచ్చి నిలుచున్నాడు. 'ఏమిసంగతి' అని అడిగినారు మహారాజ్‌జీ.

'ఏంలేదు, ఊరికేనే మీ పాదాలకు నమస్కరించాలని వచ్చాను.

కొంత సేపయింతర్వాత కూడా అతనక్కడే నిలబడి ఉండడంచూసి 'ఇంకేమిటి పని ?' అని అడిగినారు మహారాజ్‌జీ.

'కొంతభూమి దాన మివ్వాలనుకున్నాను.'

'నీదగ్గర ఎంతభూమి ఉన్నది ? ఎంత ఇవ్వదలచుకున్నావు?'

'పన్నెండు బీఘాల్లోంచి నాలుగు బీఘా లివ్వాలనుకున్నాను. అయితే మీరు మా ఇంటికిరారూ ? అక్కడ అందరూ మీకోసం ఎదురు చూస్తున్నారు.'

మహారాజ్‌జీ వెంట చాలామంది ఉండినారు. కాబట్టి ఆ పేద కుమ్మరిపైన ఎక్కువభారం పడుతుందని అక్కడికి భోజనానికి వారు వెళ్ళలేదు.

'అయ్యా, ఆ భూమి నేను ఒక హరిజనుని కిచ్చినాను. అందులో తైదలపంట ఎంతబాగా పండించనుకున్నారు! అదిచూసి

నా కమితమైన ఆనందం కలిగింది' అన్నాడా కుమ్మరి. మహా రాజ్ జీ సంతుష్టులై ఆ భూదానము, పంపకాలపైన తమ సమ్మతిని తెలిపినారు. 'నేను మీకు నాలుగు బీఘాలభూమి యిస్తానని వాగ్దానం చేసియుంటిని. నాలుగు బీఘాలభూమి అతనికేం సరిపోతుంది? అందుకని ఆరు బీఘా లిచ్చినాను' అని ఎంతో సంతోషంతో చెప్పుకుంటూ వెళ్ళిపోయినా డాసోదరుడు.

వినోబా అందుకే కావచ్చు అంటూవుంటారు 'చిన్నవారి హృదయం పెద్దదై ఉంటుం' దని.

౨౬

## భగవంతు డున్నాడుకదా

మఢీ- ఆశ్రమం విద్యార్థినులు శ్రీమతి గోమతి బహన్, శ్రీ జుగత్‌రాం భాయీలతో భూదానయాత్ర సందర్భంలో ఖోజ్ పార్డీ వెళ్ళియుండినారు. సోదరీమణులు ఇంటింటికీ వెళ్ళి భూదాన సందేశం తెలిపేవారు. ఒకవ్యక్తి తమ ఆరు ఎకరాల భూమి భూదానంగా అర్పించినారు. గ్రామంలోగల ఇతరులంతా ఆశ్చర్యచకితులయినారు. 'మీదగ్గరెంత భూమి ఉన్న'దని శ్రీ జుగత్‌రాంభాయి అడిగినారు. 'ఆరెకరాలు' అని కాళిదాసు సమాధానం చెప్పినారు.

'మూడు నాలుగురోజులముందు మా అన్నదమ్ములమధ్య పంపకాలైనవి. నా భాగానికి ఆరెకరాలభూమి వస్తుంది. ఇవాళ నా భూమి మొత్తం అర్పించదలచుకున్నాను.'

కుటుంబంలో ఒక్కరేనేమో, అందుకే అతను ధైర్యం చేసినాడని ముందనుకున్నారంతా. కాని తర్వాత తెలిసింది- వారికుటుంబంలో భార్యా, నలుగురు పిల్లలున్నారని. 'ఇక మరి మీకు జీవనోపాధి ఏమిటి?' అని అడిగితే, 'భగవంతుడున్నాడు కదా, కూలిచేసుకుంటాను' అని సమాధానం చెప్పినాడాయన. ఆవ్యక్తిముఖంలో పరిపూర్ణమైన సంతృప్తి, సంతోషభావం స్పష్టంగా కనిపిస్తూఉండినవి. దానం తీసుకొనేవాళ్ళ హృదయాలుకూడా కదలిపోయినవి.

౫౭

# గోవానుంచికూడా

గోవా సావయీగ్రామంలో శ్రీ మ. ల. రానడే అనే నవయువకులు ప్రాథమిక పాఠశాలలో అధ్యాపకులు ఖాదీ ధరిస్తారు. ఆయనకు గాంధీతత్వంమీద శ్రద్ధాభక్తు లున్నవి. మొదటినుంచే భూదానయజ్ఞంవైపు ఆకర్షితులైనారు. వారి దగ్గరనుంచి ఒకలేఖ వచ్చింది. వారి దానమహాత్మ్యాన్ని ఆలేఖ తెలుపుతుంది.

'......... ఉత్తరంతోపాటు మనియార్డరు ద్వారా రూ. ౧౭-౮-౦ లు పంపుతున్నాను. కొన్నాళ్ళకుముందు మీరు పంపిన 'ఉద్యమం', 'భూమిక' అనే పుస్తకాల మూల్యానికిగాను ౮ అణాలు పోతాయి. మీరు ఈపుస్తకాలు బుక్‌పోస్టు ద్వారా పంపియుండిరి. పుస్తకాల మూల్యం నాలుగణాలు పోస్టుద్వారా పంపమన్నారు. కాని గోవా పోస్టుబిళ్ళలు భారతదేశంలో నడు

వవు. కాబట్టి పంపలేదు. మీకీవిషయం తెలుపడం అవసరమై యుండెను. కాని ఇవాళ, రేపు అనుకోవడంలోనే చాలా ఆలస్యమైపోయింది. ఆలస్యమైనందుకుగాను విధించుకొన్న శిక్షగా నాలుగణాలు ఎక్కువగా పంపుతున్నాను. దయచేసి స్వీకరించండి. ౫౭ రూపాయలు పూజ్య వినోబాజీ భూదాన ఉద్యమంకోసం. నేనొక పేద స్కూలుమాస్టరిని. దాన యజ్ఞంలో ఇవ్వడానికి నాదగ్గర భూమిలేదు. దొరికే కొద్దిపాటి జీతంలోంచి పైసా పైసా మిగిలించి కూడబెట్టిన సంపత్తి ఇది. ఈ కుచేలుని అటుకులు స్వీకరించగలరని ప్రార్థన.'

## ౫౮

# నాకు కీర్తికాంక్ష లేదు

మా సోదరి సత్యబాల భూదానయాత్రచేస్తూ గాబడ్ అనే ఊరు చేరుకొన్నది. గాబడ్ గ్రామం ఎక్కువగా జమీందారులున్న ఊరు. సభలో జమీందార్లు, రైతులు ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. సోదరి సత్యబాల భూదాన విషయం నచ్చ జెపుతూ 'పేరు ప్రతిష్ఠల కాశించి ఇచ్చేది సాత్వికదానం కాదు. ఇచ్చేవారిలో అహంకారము, తీసుకొనేవారిలో దీనత్వము కలుగని దానమే ఉత్తమ దాన'మని అన్నది.

సభ సమాప్తమైంది. దాతలెవరూ ముందుకు రాలేదు. ఇవాళ ఇవ్వనివారు రేపు తప్పకుండా ఇస్తారన్న విశ్వాసంతో మా సోదరి బస దగ్గరికి చేరుకున్నది. ఇంతలో అక్కడి కొక

వృద్ధుడు వచ్చి ఇట్లన్నాడు: 'మీరు నా ముప్పైతొమ్మిది ఎకరాల భూమిని దానంగా వ్రాసుకోండి'. 'మీరు సభలోనే ఎందుకు ప్రకటించలేదు ?' అని ప్రశ్నించినాడొక సోదరుడు. దానికి సమాధానంగా, 'నాకు కీర్తికాంక్ష లేకుండె' నన్నాడు ఆ వృద్ధుడు.

౨౯

## మంచి మేలుకొన్నది

సోదరి విమల గయా జిల్లాలో కొన్నాళ్లు కాలినడకతో యాత్ర చేసింది. ఒక పల్లెటూరిలో ఆమెకు కలిగిన అనుభవం ఈ విధంగా తెలిపింది.

'ఒక సంస్థానంలో మేము తిరుగుతున్నాము. చాలా చిన్న సంస్థానమది. ఈ ఊళ్ళోకి వెళ్ళడం నిష్ఫలం అన్నారు తోటి మిత్రులు. ఇక్కడి రాజా పరమదుష్టుడు, త్రాగుబోతు, జూదగాడు కూడాను. ఇలాంటి మనిషికి హృదయపరివర్తనమేం జరుగుతుంది ?' అని అన్నారంతా. ప్రజానీకంలో పరమేశ్వరుని దర్శనం చేసుకోవడానికి బయలుదేరినాము. పరమేశ్వరసందర్శనం కానిదే మందిరంనుంచి బయటికి వెళ్ళడం భావ్యంకాదు. వినోబా ఉద్యమమంటే పరిహాసం కాదు. దీనికి మహా గంభీరమైన మానవ నిష్ఠ పునాది. ఈనాడు మానవనిష్ఠగల సమాజదర్శనము, మానవ నిష్ఠగల క్రాంతిదర్శనము మనకు కావలసిఉన్నవి.'

తోటివారు ఒప్పుకోలేదు. వేరే ఊళ్ళోకి వెళ్ళిపోయినారు. నేనొకర్తినే రాజాగారి దేవిడీ చేరుకున్నాను. మధ్యాహ్న

సమయమది. వారు వసారాలో పడుకొని ఉన్నారు. నేను తలుపు చప్పుడు చేసినాను. లోపలినుంచి 'ఎవరది' అన్న ప్రశ్న వినవచ్చింది. 'మీ సోదరిని' అని జవాబు చెప్పినాను. సోదరి వచ్చిం దని వినగానే ఉలిక్కిపడ్డారు రాజావారు. ఎవరన్నా పిచ్చిది రాలేదుకదా అన్నట్లుఅనుమానంతో ముందుకు వచ్చిచూడనారం భించారు. 'ఇంతవరకెట్లా చేరుకోగలిగిం దీమె' అని గొణుగుతూ 'నేనెంత క్రూరుణ్ణో గ్రామంలోవాళ్ళు మీరు చెప్పలేదా?' అని అడిగినారు. నేనింకేమీ అనకముందే ఆయనే మళ్లీ అందుకొని 'మంచివాళ్ళకు నా లాంటి మనిషితో పనేముంటుంది? నీవు యౌవనంలో వున్న పిల్లవు. తక్షణం ఇక్కడినుంచి వెళ్లిపో. ఇందులోనే నీ క్షేమం ఉంది' అన్నారు. 'మీరు దుష్టులో, త్రాగు బోతులో, జూదగాళ్ళో ఏమైతే నాకేమున్నయ్యా. ఒక్కమా టడుగుతాను సమాధానం చెప్పండి. మీకు అమ్మా-చెల్లెళ్ళూ ఉన్నారా? ఒక మహాత్ముని సందేశం తీసికొని మీ ద్వారం దగ్గ రికి చేరుకొన్నాను. ఊరికనే వెళ్లిపోయే చెల్లెల్నికాను నేను. భూదాన యజ్ఞం రక్షాబంధనం మీ చేతికి కట్టిగాని పోను' అన్నాను.

ప్రపంచం వారిని దుష్టుడన్నది. దుర్జను డన్నది. రాక్షసు డన్నది. కాని ఆయన కళ్ళలోంచి టపటపమని అశ్రుబిందువులు రాలినవి. అవి అశ్రుబిందువులు కావు. వారిలో నిద్రాణమై ఉండిన మంచి మేలుకొనిన కన్నీటిచుక్కలవి. చేతులు జోడించి 'అమ్మా లోపలికి దయచేయండి' అన్నారు. వారే సభ ఏర్పాటు చేయించినారు. వారికున్న అయిదువందల సొంత సేద్యం

భూమిలోనుంచి నూటపాతిక ఎకరాలు వ్రాసియిచ్చినారు. ఊరివాళ్ళుకూడా ఇచ్చినారు. నాలుగు గంటల లోపల ౨౧౫ యెకరాలభూమి దానం తీసికొని ఆ గ్రామంనుంచి బయలుదేరాము.

## ౬౦

# తత్త్వబోధ చేయడం మన ధర్మం

గయాజిల్లా విషయం. ఆరోజు మొత్తం రెండు మూడు ఊళ్ళు అయిపోయినవి. రాత్రిపూట బిలౌటీ అనే ఊళ్ళో మకాం ఏర్పాటు చేయబడిఉండినది. నాన్న, అమ్మ, తోటికార్యకర్తలు కాలినడకనే బయలుదేరినారు. మేము అయిదుగురు అన్నాచెల్లెళ్ళం, శ్రీ దివాకర్ జీ మోటారులో వెళుతున్నాము. రాత్రి సమయం. త్రోవసరిగ్గా కనుక్కోకనే బయల్దేరినా త్రోవ తప్పినాము.

కొండప్రాంతం, దారి చూస్తూచూస్తూ ఒక నది దగ్గరికి చేరుకొన్నాము. చుట్టూ చూడగా కొంచెం దూరంలో వెలుతురు కనిపించింది. దివాకర్ భాయి, డ్రైవరు అక్కడికి చేరుకొన్నారు. అక్కడ ఒక చిన్న పూరిగుడిసె ఉన్నది. ఒక యువకుణ్ణి అడిగితే, దారి చూపించటానికి తనకు తీరికలేదు పొమ్మన్నాడు. లోపల అతని తండ్రి కాపోలు - ఒక వృద్ధుడు కూర్చొనివున్నాడు. దారి తప్పినామనీ, వెంట చిన్నచిన్న పిల్లలున్నారనీ వినగానే, 'పదండి, నేను దారి చూపిస్తాను. పిల్లలు పరమేశ్వర స్వరూపులు' అంటూ బయటికి నడిచినారు. పరుగెత్తుతూ

మోటారు దగ్గరికి చేరుకొన్నారు. వస్తూ వస్తూ నాలుగైదు చెరకుగడలు కూడా పట్టుకువచ్చినారు. వారు మమ్మల్నందరినీ మా మకాం చేర్చినారు.

మేము ఆయనను అమ్మరు, నాన్నరు పరిచయం చేసినాము. నాన్నగారు ఆయనను దగ్గర కూర్చోబెట్టుకొని 'మీరే ఊళ్ళో ఉంటారు— ఏం చేస్తుంటారు?' అని కుశలప్రశ్నలు వేసి పిల్లల్ని చేర్చినందుకు కృతజ్ఞతలు తెలిపారు.

'అందులో నేను చేసిన ఘనకార్య మేముంది? వాళ్ళు దారితప్పినారు. నేను దారి చూపించినాను. అంతేకదా' అని అన్నారు. 'వీళ్ళెందుకు తిరుగుతున్నారో తెలుసా మీకు?' నాన్న మళ్ళీ ఆయన్ను అడిగారు. 'నాకేం తెలుసండీ' అన్నాడాయన. అప్పుడు బాబా సందేశం వినిపించారు నాన్నగారు. 'వారిదగ్గర భూమి ఏమంతలేదు. మీరెందుకు సమయం వృథా చేస్తున్నారు?' అక్కడున్న వారు కొందరు నాన్నతో అన్నారు. 'ఇంత కష్ట పడ్డారు వారు. వారికి మన ఆలోచనలు తెలియాలి. వారు మన కార్యకర్తలై పోయినారు' అన్నారు నాన్నగారు.

ఈ మాటలన్నీ విని ఆ ముసలిబాబా, 'నా దగ్గర పది కట్టాల భూమి ఉన్నది. ఒక్క ఘర్ వ్రాసుకోండి. భూమి కూడా నది ఒడ్డునే ఉన్నది. మంచి విలువైన భూమి అది' అన్నారు.

ఈ త్యాగంచూసి మా అంతరిహృదయాలు ఉప్పొంగి పోయినవి.

## ౬౧

# చావంటే భయంలేదు

గయా జిల్లా విషయమే ఇంకొకటి. మేము బారాచెట్టీ తానాలో సపరివారంగా యాత్ర చేస్తున్నాము. లహాఘువాలో మకాం. నారాయణ్ జీ అనే ఒక కార్యకర్తను గయానుంచి పంపినారు. అతని దగ్గర భూదాన సాహిత్యము, పోస్టు, ఇతర అవసర సామాన్లు ఉన్నాయి. మోటారు దిగి లహాఘువా వెళ్ళవలసి యుండెను. సుమారు రెండు మైళ్లు నడవవలసి ఉంటుంది. దారి అడవిలోగుండా ఉన్నది. సుమారు ఎనిమిదిగంటల సమయమది. కొంతదూరం వెళ్ళగానే ఇద్దరు మనుష్యులు వారిని వెంబడించి గుద్దులతో వారిని క్రింద పడవేసినారు. మెడ కిరువైపులా లాఠీలు పెట్టి అణచే ప్రయత్నం చేస్తుండగా చెట్లల్లోంచి మూడవ వ్యక్తి అక్కడికి చేరుకున్నాడు. ఏదో అడగాలన్న ప్రేరణ భగవంతుడా మనిషికి కలిగించినాడు. 'నేను వినోబాజీ కార్యకర్తను. వారి కార్యదర్శి దగ్గరికి పోస్టు, సాహిత్యం తీసుకపోతున్నాను. చావంటే నాకు భయంలేదు. కాని దీనివల్ల పేదలకు, మీకే నష్టం కలుగుతుంది' అంటూ నారాయణభాయి వారికి వాల్మీకి కథ వినిపించినారు. ఆ సందర్భంలో ఆ కథ చరితార్థం కావడం ఆశ్చర్యకరం. ఇకముందెప్పుడూ ఇలాంటి నికృష్ట కార్యం చేయబోమని స్థిరసంకల్పం చేసుకున్నారు ఆమనుష్యులు. అంతేకాదు, నారాయణజీని లహాఘువా ఊరి దగ్గరిదాకా చేర్చి క్షమాపణ కోరి తిరిగి వెళ్లిపోయినారు.

## ౬౨

# ఇల్లుకూడా భూదానంలో

చిన్న చిన్న దానాల వార్తలు అనేకం వస్తుంటాయి. పరిమాణంలో ఈ దానాలు చిన్నవే అయినా పరిణామంలో అవి ఎంతో గొప్పవై ఉంటవి- సుదాముని అటుకులు, శబరి పండ్ల మాదిరిగా.

గయా జిల్లాలో పేదవాళ్ళల్లో దానంచేయటం ఒక పోటీగా కొనసాగడం మొదలయింది. చిన్న చిన్న రైతులు హృదయపూర్వకంగా దానాలు చేసినారు. చాలా కాలంనుంచీ ప్రజాసేవచేస్తున్న రామభజన దత్తజీ ఒకరోజు పదయాత్రచేసి తిరిగివస్తూ ఉండిరి. ఘోషి ఠాణా సుకియామా గ్రామానికి చెందిన పేదవాడొకడు (వృత్తిచేత మాలీ) పరుగెత్తుకుంటూ వచ్చి ఎంతో నమ్రతతో 'భూమి ఉన్నవాళ్లు భూమి ఇస్తున్నారు. నాకు భూమిలేదు. ఇల్లుమాత్రమున్నది. నేను ఆ ఇంటినే భూదానంలో ఇవ్వగలచుకొన్నాను. దయచేసి స్వీకరించండి' అన్నాడు.

## ౬౩

# దానంలో భర్తనుమించిన భార్య

భూదానంలో సోదరీమణులు కూడా ఎక్కువగా పాల్గొన్నారు. సుకియామాం గ్రామానికి వినోబా చేరగానే ఒక

ముస్లిం సోదరుడు ౧౧ యెకరాల భూమి దానపత్రం వ్రాసి నా భార్య రోగగ్రస్తురాలై ఉన్నది. తామక్కడికి దయచేస్తారా?' అని అడిగినారు. ఆ సోదరిబదులు ఆమె చిన్నమ్మాయి అక్కడికి వచ్చిపదకొండున్నరఎకరాల దానపత్రం యిచ్చిపోయింది. వినోబా ఇంటి ద్వారందగ్గరనే నిలుచున్నారు. ఆమె చాలా బాధలో ఉన్నదని వారికి తెలిసింది. అందుచేత వారే స్వయంగా పైకివెళ్లి ఆమెను చూసివచ్చినారు. ఆ సోదరుడితో వినోబా అన్నారు- 'మీకంటే మీ భార్యే ఎక్కువ దానంచేసింది- ఇది మంచిదే అయింది' అని.

## ౬౪

# యాభై యొకటో వంతు

౮౦ సంవత్సరాల ముసలివాడొకడు చేత కర్రపట్టుకొని బాబా రాఘవదాస్‌జీ దగ్గరికి చేరుకొని 'భూమి బాబా ఎక్కడున్నా' రని అడిగినాడు.

'ఎందుకు? దగ్గరి ఊళ్ళోనే వారిమకాం ఉన్నది.'

'వారి దర్శనం చేసుకోవడానికిని పోవలసిఉన్నది.'

'తప్పక వెళ్ళండి. భూమి ఏమన్నా ఇవ్వవలసి ఉన్నదా?'

'నా తాహతెంత? అయినా నా శక్తికొలది బాబాజీ కోరికను అనుసరించి ఎంతో కొంత ఇచ్చేవస్తాను.'

వినోబా వారితో కలిసి లెక్కచూడడం ప్రారంభించినారు.

'మీదగ్గర ఎంతభూమి ఉన్నది?'

'రెండెకరాలు.'

'ఇంట్లో తినేవాళ్ళెంతమంది?'

'చిన్నా పెద్దా అంతా కలిసి ౫౦ మంది ఉంటారు.'

'ఇతనిదగ్గర తీసుకొనేదేమున్నది? ఇతని కివ్వాలిసే ఉంటుంది. వినోబా భూమి విభజన ప్రారంభించినప్పుడు తప్పక ఇలాంటివారికి భూమి దొరికితీరుతుంద' అని అంతా అనుకో నారంభించినారు.

ఇప్పుడైతే పేదవాళ్ళ సైన్యం తయారుచేస్తున్నారు వారు. మరి అందులో సైనికులను చేర్చవద్దా? వారు 'మీ భూమిలోంచి ౫౧వ భాగ మివ్వం'డన్నారు.

౬౫

## బిడ్డను ఉత్తచేతులతోనే పంపిస్తారా?

సియాడీహా గ్రామం దగ్గరలోనే ఒక చిన్నపల్లె ఉన్నది. ఈ ఊళ్ళో బసచేయటంవల్ల ఏం లాభం లేదన్నారు మిత్రులు. 'భూదానతత్వం వారికి చక్కగా నచ్చచెప్పడం మనధర్మం' అన్నాను నేను. కొంతసేపటిలోనే జనం సమూహమైనారు. కొద్దిలో వారికి భూదానతత్వం తెలిపినాము. ఒక సోదరుడు తన ఏడవభాగం దానమిచ్చినాడు. ఎదురుగా కూర్చున్న ఒక సోదరుణ్ణి 'చెప్పండి మీరెంత వ్రాయమన్నారు?' అని అడిగినాను. 'ఒక్కబీఘా వ్రాసుకో'మన్నారు ఆయన. 'మీకున్న భూమి ఎంత?' అని సహజధోరణిలోనే ప్రశ్నించాను.

'ఆరు బీఘాలు,'

'ఒక్క బీఘా చాలా తక్కువే?'

'అయితే ఒకటిన్నర వ్రాసుకోండి.'

'ఆరవభాగం తీసుకోవాలని వినోబాజీ ఆదేశం' అన్నాను.

'లేదండీ, ఇదే చాలా ఎక్కువైపోయింది. ఇంతకన్నా ఒక్క ధుర్ కూడా నేను ఎక్కువ ఇవ్వలేను.'

'బాబాజీ, నేను మీ బిడ్డనై వచ్చినాను. బిడ్డను ఉత్త చేతుల్తోనే పంపిస్తారా?' అన్నాను.

'సరే. నాలుగుబీఘాలు వ్రాసుకోండి' అన్నారాయన.

నేను మనస్సులోనే నమస్కరించినాను. 'శ్రద్ధతో అడిగినట్లయితే తప్పక దొరికితీరుతుం' దని బాబా చెప్పినమాట జ్ఞాపకమొచ్చింది.

సభానంతరం అందరికీ పెద్ద ఆశ్చర్యంవేసింది. ఆ సోదరుడు ఎట్లా ఆరవభాగం ఇచ్చినాడా అని. ఆ చుట్టుప్రక్క ప్రాంతాలలో పరమ లోభిగా ఆయన ప్రసిద్ధుడట!

౬౬

# నేని ఊళ్లో ఉండను

గురువా తానాలో చివరి మజిలీ. అందరూ తమ తమ భాగా లిచ్చినారు. ప్రజాసోషలిస్టుకార్యకర్త శ్రీ అంబికాబాబు తండ్రిగారు భూమి ఇవ్వనన్నారు. తండ్రికి చాలా నచ్చజెప్పినారు వారు. సభానంతరం ముందు కార్యక్రమం తయారుచేయబడింది.

'ఇక నేనీ ఊళ్ళో ఉండ' నన్నారు అంబికాబాబు: 'మా నాన్న గారు తమభాగం యివ్వలేదుకాబట్టి నేనూ, నాపిల్లవాడూ, మేమంతా మీతోకూడా వచ్చేస్తాము.' అంబికాబాబు అన్నగారు అక్కడే కూర్చొని ఇదంతా వింటూఉన్నవాడల్లా, 'కాదు. అట్లా జరగడానికి వీల్లేదు—మేముకూడా ఆరవభాగ మిస్తాము' అని వారు ప్రకటించినారు.

౬౨

# నేనంతా అర్థంచేసుకొనే ఇస్తున్నాను

గయాజిల్లాలో మఖ్దుంపూర్ థాణాసంగతి. మఖ్దుంపూర్ నుంచి రెండుమైళ్ళదూరంలో ఒక సభ జరుగుతూ ఉండెను. సభానంతరం భూదానాల ప్రకటన ప్రారంభమైనది. రామకృష్ణ అనే ఒకరైతు 'నాభూమి మొత్తం వ్రాసుకోండి' అన్నాడు.

'ఎంత భూమి ఉంది మీకు?'

'మూడు ఎకరాలు.'

'మరి మీరేం చేస్తారు?'

'కూలి.'

'ఇంట్లో ఎవరెవరున్నారు?'

'భార్య, పిల్లవాడు.'

'మీరు అర యెకరం ఇవ్వండి. రెండున్నర యెకరం ఉంచుకోండి.'

'వద్దండి, నేను చక్కగా కూలి చేసుకోగలుగుతాను. నేను నిర్ణయం ఇదివరకే చేసుకొన్నాను. బాగా ఆలోచించే యున్నాను.'

ఎన్ని తీరులుగా నచ్చజెప్పినప్పటికీ ఆయన వినలేదు. 'వీరు ముగ్గురన్నదమ్ములు. ఆరు సంవత్సరాలనుంచి న్యాయ స్థానంలో వ్యాజ్యం నడుస్తుండినది. ఈ మధ్యనే పరిష్కారమై పోయింది. వీరికి భూమికోసం పదివేల రూపాయలు ఖర్చు అయినవి' అని తెలిపినారు ప్రజలు. అనేకసార్లు సముదాయించినప్పటికీ ఒప్పుకోలేదు. బాపూజీకి జై, వినోబాజీకి జై అనే నినాదాల మధ్య ఆ దానం స్వీకరించబడింది.

## ౬౮

# సద్భావం యొక్క సాక్షాత్కారం

మా యాత్ర జారాచెట్టి థానాలో జరుగుతూ ఉండినది. సమీపంలోనే ఫతేపూర్ థానా సరిహద్దు ఉన్నది. నాలుగుమైళ్ళ దూరంలో ఛప్రా జిల్లాకు చెందిన ఒక పెద్ద భూస్వామి బబన్ బాబు కమతం భూమి ఉన్నది. బబన్‌బాబు తరుచు అక్కడ ఉండరు. కాని ఆనాడు అక్కడే ఉన్నట్లు తెలిసింది. ఉదారులు. ఇదివరకే వేయి యెకరాలు ఇచ్చి నారు. అయితే ఇంకా ఇవ్వగల శక్తి ఉన్నవారు. ఇచ్చే అవకాశం కూడా ఉన్నది. బబన్ బాబుతో కలిసి వెళ్లినట్లయితే ఆరుమైళ్లు చుట్టు తిరిగి పోవలసి ఉంటుంది. మాల జ్వరంతో బాధపడుతున్నది. ఆనంద్‌కు

కుండా జ్వరం వచ్చింది. బండీ, మోటారు ఏర్పాట్లుకూడా చేయడానికి వీల్లేకపోయింది. అందరితోనూ ఆలోచించినమీదట దత్తప్రసన్నారాయణ జోలె తీసికొని బయల్దేరినాము. బబన్ బాబును కలుసుకొనే వెళుదామని నిర్ణయమైంది. పిల్లల ఉత్సాహం చూసినమీదట 'రమారమణ గోవిందా గోవింద' అని హరి నామస్మరణ చేసుకొని ముందుకు బయలుదేరినాము.

మా తోటి మిత్రులు కొంత ముందే వెళ్ళి మేము వస్తున్న సంగతి వారికి తెలిపినారు. బబన్ బాబు ప్రేమపూర్వకంగా స్వాగత మిచ్చినారు. తర్వాత సంభాషణ ఇలా ప్రారంభమైంది.

'ఇవాళ మీమీద నాకు కోపంగా ఉన్నది.'

'మీకు మా మీద కోపం వచ్చేటంత అపరాధం మేమేం చేయలేదే ?'

'జ్వరంతో ఉన్న పిల్లల్ని తీసుకొని మీరెందుకొచ్చినా రిక్కడికి ? నన్నే పిలుపించుకోవలసింది. కేవలం వర్తమానం పంపించవలసింది. నేనే స్వయంగా హాజరయ్యేవాణ్ణి.'

'క్షమాపణ వేడుకొంటున్నాము' అని చెప్పి వారి సద్భావాన్ని మనస్సులో ఎంతో ప్రశంసించినాము.

స్నాన భోజనాదులు కానిదే అక్కడినుండి బయల్దేరడం సాధ్యమైనట్లు తోచలేదు.. భోజనం సిద్ధం చేయబడింది. భోజనా లకు లేవవలసిన సమయం. అనుకూల సమయం చూసి నాన్న* దక్షిణ విషయం ఎత్తినారు.

---

రచయిత్రి తండ్రి శ్రీ దామోదర్‌దాస్ మూంద్‌డా.

'మీరు ముందే వేయి యెకరాలు ఇచ్చినారు. ఇందుకు మేమెంతో కృతజ్ఞులం. అయినా మా కోరిక ఉండనే ఉంటుంది. మీ కెంత భూమి ఉందో మాకు తెలియదు. ఇంకా కొంత యిచ్చే అవకాశం ఉన్నదని మిత్రుల ద్వారా తెలిసింది. మీరే ఆలోచించండి. భూమి సమస్య ఆరవభాగం యిచ్చేంతవరకు పరిష్కారం కాదు. పెద్ద భూస్వాములు ఎక్కువ కెక్కువ ఇవ్వవలసిఉంటుంది. కాబట్టి మీరు ప్రస్తుతం ఆరవభాగం పూర్తిచేయండని కోరుతున్నాము. ఇంతకు ఎక్కువ మీరెంత తలచుకొంటే అంత ఇవ్వవచ్చు. దీనితో ఇతర భూస్వాములను అడగడానికి ఎక్కువ సహాయం లభిస్తుంది.'

బబన్ బాబు లెక్క చూసుకొన్నారు. కాగితాలు మొత్తం దగ్గర లేకుండినవి. 'ఆరవభాగంకన్నా తక్కువ గాకుండా అంచనా చొప్పున కొంత వ్రాస్తాను' అని అయిదువందల యెకరాల దానపత్రం వ్రాసి యిచ్చినారు. మొత్తం పదిహేను వందలైంది. ఎన్ని యెకరాల దానపత్రం వ్రాస్తారో అని అంతా వారి వైపుకే చూస్తూ ఉండిరి. మాల, భారతి జ్వరాలు ఏమైపోయినవో. బబన్ బాబు ఆనంద్ చేత్తో దానపత్రం వ్రాయించినారు. ఆయనతో అందరికీ ఆత్మీయతానుభవం కలిగింది. పిల్లల కోసం వాహనం ఏర్పాట్లు కూడా వారు చేసినారు.

బయలుదేరడానికిముందు నాన్నగారు మరొక కోరిక వారిముందు పెట్టినారు.

'మీరు భూమిగల ఇతర మిత్రులతోకూడా భూమి ఇప్పించాలె. మీరేకదా వినోబాజీ కార్యకర్తలు?'

కొంతసేపు ఆలోచించి బడాబాబు ఇట్లన్నారు. 'ఇది ఫిబ్రవరి. ఏప్రిల్, మే నెలల్లో కార్యకర్తను పంపించండి. ఈచుట్టు ప్రక్కల నాకు సంబంధమున్న ఇరవై—ముప్ఫై గ్రామాలలో భూదానంపని చేయడానికి సిద్ధంగా ఉన్నాను. బహుశః అంతా ఇస్తారు' అన్నారు. ఆనాటి సత్సాంగత్యాన్ని తలచుకొన్నప్పుడల్లా ఇప్పటికికూడా మేము పులకితులమవుతుంటాము.

౬౯

# అపూర్వ సంఘటన

చాండిల్ సమ్మేళనానికి పూర్వంనుంచే జయప్రకాశ్‌జీ తమ పూర్తిశక్తితో భూదాన యజ్ఞంలోకిమాకి పనిచేస్తూఉండిరి. కాని ఆయన హృదయంలో మథనం జరుగుతూ ఉండినది.

జీవన సమర్పణం చేయనిది భూదానయజ్ఞదేవతకు తృప్తి కలుగజాలదని వారు తమ అనుభవంద్వారా తెలుసుకొన్నారు. బుద్ధగయ సమ్మేళనంలో వారుతమజీవనదానం ప్రకటనచేసినారు. అంతేకాదు-అందరినీ జీవనదానంచేయవలసిందిగా ఆహ్వానించారు.

బహుశః రెండవరోజు ప్రార్థనానంతరం జయప్రకాశ్‌జీ చేతికి జీవనదాన సమర్పణ పత్ర మొకటి చేరింది.

"శ్రీ జ. ప్ర.

మీ ఆహ్వానమును పురస్కరించుకొని భూదానమమూలమున గ్రామపరిశ్రమలు ప్రధానంగాగల అహింసాక్రాంతికి నాజీవన సమర్పణము.

౨౦-౪-౫౪. వినోబా ప్రణతులు."

జీవనదానపత్రంలో వ్రాసివున్న భావస్ఫూర్జితమైన వాక్యాలు ధీరుడు, గంభీరుడు అయిన జయప్రకాశ్ హృదయాన్ని కదలించివేసినవి. సత్రమత మూర్తీభవించిన వారి వ్యక్తిత్వము గురుతరమైన ఈ భారమును వహించడానికి సంకోచించింది. వారి సంకోచం పెరిగినకొద్దీ హిమాలయంయొక్క ఔన్నత్యంవలె సమర్పణంయొక్క మాన్యతకూడా పెరుగుతూ పోయింది. రెండుగంటల అవధిలో అయిదువందల కెక్కువ కార్యకర్తలు (అందులో సర్వసేవాసంఘం అధ్యక్షులు, సమ్మేళనాధ్యక్షురాలు మొదలుకొని చిన్న చిన్న కార్యకర్తలవరకు ఉన్నారు.) తమ జీవనసమర్పణం చేసినారు.

మానవేతిహాసంలో ఈ సంఘటన అపూర్వమైనదిగా భావింపబడగలదు.

## ౨౦

# ప్రేమలో వున్న ఆక్రమణశక్తి

ఆ రోజు ఒకవ్యక్తి గయాజిల్లా భూదానసమితి కార్యాలయంలోకి వచ్చి రెండువందల యెకరాల దానపత్రం వ్రాసియిచ్చి వెళ్ళినారు. వారు స్వయంగా వచ్చి తాము విశేషమైనట్టి ఏ కార్యమూ చేయనివారివలె అత్యంత నమ్రభావంతో దానపత్రం వ్రాసియిచ్చిపోయినారు. వారికి వినోబాజీ సాహిత్యమంతా ఇయ్యబడింది. ఉత్సాహపూర్వకంగా వారు తీసుకు వెళ్లినారు.

ఇప్పటివరకు గయానగరం పని డాక్టరు శ్రీ కేశవప్రసాద్ సింహ ఎంతో ఉత్సాహంతో నిర్వహిస్తూ ఉండిరి. కాని వారు అక్కడి నుంచి వెళ్ళి పాట్నాలోనే ఎల్లప్పటికీ ఉండిపోవాలనే నిశ్చయించు కున్నారు. గయాపట్టణం బాధ్యత ఎవ్వరికి అప్పచెప్పడం? భూప్ బాబు పేరు సూచింపబడింది. వారు నాన్నగారిని వెంటబెట్టుకొని భూప్ బాబుతో కలవడానికి వారి ఇంటికి వెళ్లినారు. భూప్ బాబును చూడగానే నాన్నగారు, 'మీరేకదా మొన్న కార్యాలయంలో రెండువందల యెకరాల దానపత్రం వ్రాయించింది?' అన్నారు. భూప్ బాబు మాట్లాడకుండా ఊరుకొన్నారు. వారు సంకోచిస్తూ ఉండినారు. 'ఇక మీరు వినోబా కార్యకర్తకూడా కావలసివున్నది' అన్నారు. అప్పటినుంచి వారు భూదాన కార్యంలో ఎక్కువ శ్రద్ధ తీసుకో నారంభించినారు.

ఈ మధ్య వినోబాజీ ద్వితీయ యాత్ర గయాజిల్లాలో జరుగవలసిందిగా నిర్ణయింపబడింది. మిత్రులు స్వాగతసమితి అధ్యక్షబాధ్యత భూప్ బాబుమీదనే వేసినారు. వినోబాజీ సేవా భాగ్యం లభిస్తున్నందుకు ఒకవంక భూప్ బాబుకు సంతోషం ఉన్నప్పటికీ రెండవవంక వినోబాజీకి సమర్పించదగిన పత్రం పుష్పం ఏమిటా అని వ్యాకులతకూడా పెరుగుతూ పోయింది. ప్రజలను దానమడుగుతూ ఉండే వారికి మనసులో సంకోచం కలుగడం ప్రారంభమైంది. పెద్దపెద్ద జమీందార్ల దగ్గరికి పోవలసి యుండెను. రాత్రి సాంతం భూప్ బాబు భక్తహృదయం చింతా నిమగ్నంగానే గడిచింది. మరుసటిరోజు ఉదయంనుంచే వారు దాన మడగడం ప్రారంభించినారు. వారి మాటల్లో విశేష

సంకల్ప శక్తి ద్యోతకమైంది. వినోబాజీకి స్వాగతం చెప్పుటకు వేదికమీద నిలుచున్నారు. తమ హృదయాన్ని విప్పి వినోబాజీముందు ఉంచినారు.

'వినోబాజీ! నా మొత్తంభూమి సుమారు మూడువేల బీఘాలు మీ సేవలో సమర్పిస్తున్నాను.'

'సుమారు' అని ఎందుకన్నారంటే అప్పట్లో కాగితాలు తయారుగా లేపుగనుక. కాగితాలు తయారైన తర్వాత చూస్తే సంఖ్య ద్విగుణీకృతమైంది.

వేసవిరోజులు. ఒకనాడు భూప్‌బాబు నాన్నగారు చాలా చింతితులై ఉన్నట్లు గమనించినారు.

'మీ హృదయంమీద వున్న భారం ఏమిటి?' అని అడిగినారు. 'కార్యాలయంకోసం సరియైన ఇల్లు దొరకడంలేదు. పని పెరుగుతూపోతున్నది. రెండుచోట్ల కార్యాలయా లున్నవి-డాక్‌బంగ్లాలోనూ, స్టేషన్ ధర్మశాలలోనూ. ప్రజలకు రాకపోకలకు కూడా చాలా ఇబ్బంది కలుగుతున్నది.'

'ఇవ్వాళే కార్యాలయం మా ఇంట్లోకి మార్చివెయ్యండి. అక్కడైతే మేము కూడా కొంచెం ఎక్కువసమయం ఇవ్వగలుగుతాము. అదిగాక ఆశ్రమవాతావరణం గూడా ఉంటుంది. పిల్లలకు మంచి సంస్కారం కలుగుతుంది. భూప్‌బాబుకు అసౌకర్యం కలుగకూడదనే అభిప్రాయంతో కార్యాలయం అక్కడికి మార్చబడలేదు.

కాని బుద్ధగయ సమ్మేళనానంతరం ప్రాంతీయ భూదాన కార్యాలయం గయకు మార్చాలని నిర్ణయం జరిగింది. సర్వ

సేవాసంఘ కార్యాలయం కూడా గయలో ఉంచవలసిందిగా నిశ్చయమైనది.

ఈసారి భూప్ బాబు ఒప్పుకోలేదు. వారి తరఫున ప్రేమ ఆశ్రమంలోనే జరిగించుకోండి. సర్వసేవాసంఘ కార్యాలయం అక్కడే పెట్టవలసిందిగా వారు శ్రీ వల్లభస్వామిచేత ఒప్పించుకున్నారు. స్వామీజీకూడా భక్తహృదయుని ఆతిథ్యం స్వీకరించడమే సముచిత మనుకున్నారు.

ఈనాడు భూప్ బాబు నివాసస్థానం భూదానకార్యానికి అఖిలభారత కేంద్రమైయున్నది.

## ౨౧.

# రెండెకరాల బదులు యాభై యెకరాలు

గుజరాత్‌లో జరిగిన పవిత్ర సంఘటన. ఒక సోదరుడు రెండు బీఘాల భూమి ఇచ్చినాడు. ఆ భూఖండం మొత్తం నాలుగు బీఘాలు ఉండినది. పంపిణీ సమయంలో అది వారు పూర్తిగా ఇచ్చివేసినారు. ఎక్కువిచ్చినందువల్ల ఉత్సాహం కలిగింది. ఆ ఉత్సాహంలో 'ఈ భూమి గనుక హరిజనులకు ఇచ్చినట్లయితే నా భూమి మొత్తం ఇస్తా' నన్నారు.

శ్రీ నారాయణ దేశాయి పంపకంనిలిపివేసి ఆలోచించుకోటానికి దాతకు ఒకరోజు సమయ మిచ్చినారు. రెండవరోజు ఆ భూమి కొనడానికి కొంతమంది బేరగాళ్ళు కూడా తయారైనారు. సుమారు పదివేల రూపాయలదాకా పాట పాడబడింది.

పాట పాడినవారు కూడా భూమి గలవారే. కాని దాత భూమిని వారు సాగుచేస్తూ ఉండిరి; కనుక శాసనరీత్యా ఆ భూమి కొన డానికి హక్కుదారులై యుండిరి. వారు పట్టుదల చూపినట్లయితే మేమేమీ చేయగలిగేవాళ్ళం కాము. దాతకు, గ్రాహకులకు విషయమంతా తెలియజేయబడింది. ఇరుపక్షాలూ ఒప్పుకొన్నారు. రెండు బీఘాలకు బదులు ౧౦ బీఘాల భూమి లభించింది. మరొక సోదరుడు కూడా ఆ ఊళ్ళో మిగిలిన తన ఆరు బీఘాలభూమికూడా ఇచ్చివేసినాడు. మొట్టమొదట దాత ఇచ్చిన భూమి హరిజనులకు ఇచ్చివేయబడింది. మిగిలినభూమి గ్రామంలో గల ఇతర భూమి లేనివారికి ఇవ్వబడింది. దున్నేవారిలో కూడా తక్కువ భూమి గలవారికి ఇవ్వబడింది. కొనదలచుకొన్నవారు ఏ పరతూ లేకుండా దానానికి సమ్మతి తెలిపినందుకు గాను వారికి కూడా రెండు రెండు యెకరాల భూమి ఇవ్వబడింది. పశువుల మేతకొరకు కూడా కొంతభూమి ప్రత్యేకించబడింది.*

## ౭౨

# ప్రేమశక్తి ప్రభావం

ఆ రోజు రెండు సర్వస్వ దానాలు జరిగిన గ్రామాలలో బాబాచేత పంపిణీ చేయబడుతూఉండెను. ఒక్కొక్క భూమి పుత్రుడు వచ్చేవాడు. బాబాయిచ్చే తనభాగపు భూమి ప్రమాణ పత్రము, ప్రసాదము గ్రహించి వెళ్ళేవాడు. ప్రతిపేరు చదివి

*నారాయణభాయి దేశాయి లేఖ ఆధారంగా.

(ఆ దాత) గ్రహీతకు ఇంతకు పూర్వం భూమి ఉండెనా లేకుండెనా, ఉండినట్లయితే ఎంత ఉండేది, ఇప్పటి అవసరం ప్రకారం ఎంత దొరుకుతున్నది వగైరాలన్నీ సవివరంగా తెలియజేయబడేవి.

ఒక సోదరుని పేరు చదువబడినతర్వాత అంతా విన్నారు.

'ఫలానా సోదరుడిదగ్గర ఇరవైనాలుగెకరాల భూమి ఉండినది. ఇప్పుడు వారికి మూడున్నర యెకరాలు దొరుకుతున్నది.'

ఈమాట వినగానే పెద్ద అట్టహాసంతో సృష్టిఅంతా ఆశీర్వదిస్తున్నదా అన్నట్లు హర్షధ్వానాలు చెలరేగినవి. 'ఆనందే హరి బోల్' అన్న నినాదంతో వాతావరణం మారోమ్రోగింది. కాని పేర్లు ఇంకా చదువబడుతూ ఉండెను. 'ఫలానా వారి దగ్గర భూమి ఏమాత్రం లేకుండినది. వారికి అయిదెకరాల భూమి దొరికింది.' అందరి ముఖాలూ హర్షానందాలతో వికసించినవి. ఉత్కళంలో బహుశా రోజూ ఇటువంటి దృశ్యం కనిపిస్తూనే ఉండేది.

'ఇరవైనాలుగెకరాలు గలవానికి నాలుగెకరాలిచ్చి మెప్పించి సంతుష్టుణ్ణిచేసే శక్తి ఏ శాసనానికి ఉన్నది?' అని బాబా అడుగుతూ ఉంటారు.

'ప్రేమశాసనం తప్ప ఇంతటి శక్తిశాలి అయినట్టి శాసనం మరేదిలేదు'

బాబా అడుగుతుంటారు:

'ఒకవేళ హైడ్రోజన్‌బాంబుచేత ప్రపంచ వాతావరణం విషమయ మైపోయినట్లయితే విద్యున్మయమైన ప్రేమతరంగాల వల్ల సద్భావం సర్వత్రా ఎందుకు వ్యాపించదు?'

ఈ శ్రద్ధాబలంపైనే '౧౯౭౦ సంవత్సరంవరకు సర్వోదయ సార్వభౌమత్వసంస్థాపన' అన్న భవిష్యద్వాణి వినోబాజీ ముఖతః ప్రకటితమైంది.

## ౭౩

# గ్రామదాన ప్రవాహం

ఉత్కళంలోని కోరాపుట్టిజిల్లాలోజరిగిన కథ ఇది: ఒక రోజు మజిలీ కుటలీ అనే చిన్న పల్లెటూళ్లో ఉండింది. స్వాగత మివ్వడానికి ఒక పల్లెటూరివాళ్లు కీర్తనలు పాడుకొంటూ దారిలో కనిపించినారు. వినోబా వారినాయకుని భుజంమీద చేయివేసి 'గ్రామదానం చేయించరూ' అని అడిగినారు.

కుటలీలో స్త్రీలు, పురుషులు అంతా స్వాగతంకోసం వచ్చియుండిరి.

అక్కడగూడా బాబా గ్రామదానం విషయం నచ్చ జెప్పినారు.

'ఆలోచన బాగుందా?' అని ప్రజలను ప్రశ్నించినారు.

'బాగానేవుంది. కాని మానాయకులు జబ్బుపడిఉన్నారు.'

'అయితే వారికి మా నమస్కారములు చెప్పండి. బాబా గ్రామదాన మడుగుతున్నాడన్న మా సందేశంకూడా వారికి నివేదించండి.'

మధ్యాహ్నంవరకు కుటలీ గ్రామస్థులువచ్చి తమ గ్రామ దాన నిర్ణయం తెలిపి వెళ్ళిపోయినారు. కొద్దిసేపట్లోనే దారిలో కలిసిన గ్రామంవాళ్లు కూడా వచ్చి తమ గ్రామదాన సంకల్పం తెలియ జేసినారు. ఇంతలో గోపబాబు ఒక కార్యకర్తను వెంటబెట్టుకొని బాబా దగ్గరికి వచ్చినారు. ఆ సోదరుడు గ్రామాల్లో పని చేయడానికి వెళ్ళియుండెను. ఎనిమిది గ్రామా ల్లోంచి గ్రామ దానాలు తీసుకొని వచ్చినారు.

'అయితే ఇవాళ మొత్తం పది అయిన వన్నమాట' బాబా అన్నారు. ఇంతలోనే గోపబాబు మరొక కార్యకర్తనుగురించి తెలిపినారు. 'వీరు పది గ్రామదానాలు తీసుకొని వచ్చినారు'అని.

'అయితే మొత్తం ఇరవై అయినా'యన్నారు బాబా.

మన్మోహన చౌదరివచ్చి బాబా పేర వచ్చిన ఒరియా పోష్టు చదువ నారంభించినారు. కటక్ జిల్లాలోనుండి రెండు గ్రామ దానాలు వచ్చినవి.

బాలేశ్వర్‌లో కూడా రెండు క్రొత్త గ్రామ దానాలు వచ్చినవి. ఈ పవిత్ర సంఘటనలు వింటూంటే కరుణామయుడైన ఆ పరమేశ్వరుని మహిమచేత అందరి హృదయాలూ పులకితము లైనవి.

అందుకే అన్నాడు క్రీస్తు:

'పంట సిద్ధమైయున్నది, కార్యకర్తలే కావలసి యున్నారు' అని.

## ౨౪

# గంగోత్రి దివ్యస్మరణం

మొట్టమొదటి రోజు, ౧౮ ఏప్రిల్ నాడు వినోబాజీ కోరిక పైన నూరు యెకరాలు ఇచ్చినప్పటికీ, ఇప్పటివరకు పోచంపల్లికి ఎవరెవరు వెళ్ళినారో వారెవ్వరినీ ఉత్త చేతుల్తో పంపించలేదు శ్రీ రామచంద్రా రెడ్డిగారు.

శ్రీ జయప్రకాశ్ జీ వెళ్ళినారు. వారికి కూడా భూదానమిచ్చినారు.

శ్రీ కేశవరావుగారు వెళ్లితే వారిని కూడా ఉత్త చేతులతో పంపించలేదు.

ఎవరు ఆ గంగోత్రి దర్శనానికి వెళ్లినా ఏదో కొంత భూదానం దొరుకుతూనే ఉన్నది.

సుమారు నాలుగువందల యెకరాలదాకా ఇచ్చినారు శ్రీ రామచంద్రా రెడ్డిగారు. ఇప్పుడు వారిదగ్గర బహుశా ౧౫ యెకరాల తరీభూమి, ౬౪ యెకరాల ఖుష్కీభూమి ఉన్నది. ఈ మధ్యనే పోచంపల్లి పేర సందేశ మొకటి తీసికొని వినోబాజీ కార్యదర్శి (రచయిత్రి తండ్రి) అక్కడికి చేరుకున్నారు. బహుశా ఉత్కళం తర్వాత వినోబాజీ తెలంగాణాకు వెళ్లుతారు. ఆ ఉద్దేశంతో ఉత్తరంద్వారా* కొన్ని ఆలోచనలు గ్రామస్థుల ముందు పెట్టబడినవి. కొత్తసంకల్పమేంచేయాలని రామచంద్రా రెడ్డిగారు ఆలోచించ నారంభించినారు.

---

* బాబా, ద్వితీయ తెలంగాణా యాత్రకు పూర్వం వ్రాసినది—అనువాదకుడు.

ఆనాటి సభలో వారీవిధంగా ప్రకటించినారు :

'ఏ రోజు ఈ ఊరులో గ్రామీకరణం జరుగుతుందో, ఆ రోజుకు నేను అందుకు సర్వదా సంసిద్ధుడనై ఉంటాను. అప్పటివరకు నాదగ్గర ఉన్న భూమికి నన్ను నేను ధర్మకర్తగా మాత్రమే భావిస్తాను. దానినుంచి వచ్చే ఆదాయంలోంచి ఆరవ భాగం సంపత్తి దానం ఇస్తూ ఉంటాను.'

రామచంద్రా రెడ్డిగారి ప్రకటన ఇంకా పూర్తికానేలేదు. కొంతసేపాగి మళ్లీ 'ఇవ్వాల్టినుంచి నా జీవితం ఈ గ్రామసేవ కోసం సమర్పిస్తున్నాను' అన్నారు.

తమ ధర్మపత్ని వంకకు చూడగానే వారు లేచి నిలబడి అందరికీ నమస్కారం చేసినారు.

'గ్రామసేవ చేయడానికి మీరుకూడా సిద్ధంగాఉన్నారా?' అని అడిగినారు రామచంద్రా రెడ్డిగారు.

వారు అందుకు తమ సమ్మతిని ప్రకటించినారు.

గ్రామవాసులలో మళ్ళీ ఒక నవచైతన్యం కలిగింది. పెద్ద పెద్ద భూస్వాము లెవరున్నారో, వారిలో అధికభాగం తమతమ భూములలోనుండి ఆరవభాగం వ్రాసి యిచ్చినారు. మొత్తం గ్రామంలోని ఆరవభాగం సేకరించడానికి పెద్దభూస్వాము లందరూ కృషి ప్రారంభించినారు.

వినోబాజీ స్వాగతంలో పురుషసూక్తం చదివిన శాస్త్రిల వారుకూడా అక్కడికి వచ్చినారు. అప్పుడు వారు కేవలం టెంకాయమాత్రమే వినోబాజీకి సమర్పించియుండిరి.

ఈసారి వారి సేవకునిద్వారా, వారిదగ్గర ఉన్న ౪౮ ఎకరాల్లోనుండి, ఆరవభాగం ఎనిమిది ఎకరాల దానపత్రం వ్రాయించినారు.

ప్రథమదాత, భూమి గలిగిఉన్న ఇతర గ్రామవాసులు అందరూ తమ సహకారాన్నిచ్చినారు. ఇక మిగిలిపోయింది భూమిపుత్రులు. వారేమి యిస్తారు? నాన్న వాళ్ళను కూడా అడిగినారు.

'మీరుకూడా ఇవ్వవచ్చు' నన్నారు.

'మాకు వశంకాగలిగిందేదైనా చెప్పండి చేస్తా' మన్నారు వారు.

'మీరింతవరకు కల్లు సారాయి మానలేదు. మీకున్న ఈ వ్యసనాన్ని నాకు దానం చేయండి.'

ఇవాళ్ళటినుంచి కల్లు సారాయి త్రాగమని భూమిపుత్రు లంతా ప్రతిజ్ఞ తీసుకున్నారు.

ముస్తాజరు (గుత్తాదారు) అక్కడినుంచి తన దుకాణం తీసివేసినాడు. ప్రభుత్వంకూడా మిగిలిఉండిన గుత్తాడబ్బుకు మాఫీ యిచ్చింది. భూదాన గంగోత్రి సంస్మరణం నానాటికీ నిత్యనూతనంగా ప్రేరణ కలిగించే దవుతున్నది.

౭౫

# మహారాజ్‌జీ మూడడుగులు

## ౧. చాండిల్

వారి జీవితం సాంతం గుజరాత్ 'సర్వహారుల' సేవలో గడిచింది. గుజరాత్‌లో నివసించే ఈ జాతివారిని సంఘం నేరస్థు

లనీ, దొంగలనీ తిరస్కరించింది. కాని వారి హృదయంలో మాత్రం అత్యున్నతస్థాయి లభించిందివీరికి. వారిసేవ పీడితులు, దుఃఖితులు అయిన ఆ మానవుల జీవితాలలో పూర్తిగా మార్పు తీసుకురాగలిగింది.

కాని భూదాన రణభేరి మహారాజ్‌జీని తమ సుదీర్ఘ సాధననుండి విచలితులను చేసింది.

వారు వినోబాజీ దగ్గరికివచ్చి కలుసుకున్నారు. తమ పూర్తిసమయాన్ని భూదాన కార్యానికి ఇవ్వడానికి నిర్ణయం చేసుకున్నారు.

## ౨. బోధగయ

వినోబా తమ గదిలో ఒక్కరే కూర్చొని ఉన్నారు. మహారాజ్ లోపలికివచ్చి నమ్రతాపూర్వకంగా ఇట్లని నివేదించినారు. 'నేను జీవనదానమివ్వాలా, వద్దా అని ఆలోచిస్తూ ఉంటిని. ఎందుకంటే క్రొత్తగా సంకల్పం చేయడానికింకేమున్నదిగనుక? జీవనమెప్పుడో దానం చేసినాను. అయినా ఈ సంకల్పంలో గొప్ప శక్తి వున్నట్లు స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నది. జీవనదాన విషయమైన చింతనము మనస్సులో ప్రారంభమైనప్పటినుండి వృద్ధాప్యం జ్ఞాపకం రాకుండా ఉన్నది. యవ్వనంలో ఉన్నట్టుగా అనుభవిస్తున్నాను. జీవనదాన సంకల్పం గొప్ప చైతన్యాన్నివ్వ గలదిగాగలదు. కాబట్టి నా జీవనదానం స్వీకరించండి.'

వినోబాజీ అనేకసార్లు పవిత్రము, ప్రేరకము అయిన ఈ సంఘటనను పేర్కొన్నారు.

## ౩. పూరీ

ఆహ్వానతీర్మానం ఆమోదించబడింది. సేవకులు సెలవు తీసికొని తమతమ స్థానాలకు చేరుకొంటూ ఉండిరి. ఒక వృద్ధుడు సెలవు తీసుకోవడానికి వినోబాజీ దగ్గరికి వచ్చినారు. వారి ముఖ మండలముమీద చిరునవ్వు నాట్యమాడుతున్నది. సమ్మేళ నాధ్యక్షుడు భారంనుంచి వారు విముక్తులై యుండుట మూలాన కావచ్చు, వారు ముక్తహృదయులుగా కన్పిస్తూండిరి. వారి వాలకంచూస్తే కృతనిశ్చయులై ఉన్నట్లు కనిపిస్తూ ఉండినది. ఎప్పటిమాదిరిగానే తమ సహజధోరణిలో వారిట్లు నివేదించినారు.

'రెండు సంవత్సరాలదాకా కాలినడకనే తిరగాలని ప్రేరణ కలుగుతున్నది. ౧౩ ఏప్రిల్ నుంచి ప్రారంభించడం బాగుం టుంది. బుద్ధగయలో జీవనదానంవల్ల యవ్వనానుభవం కలిగింది. ఈ ఆహ్వానంవల్ల నూతనోత్సాహం కలుగుతున్నది. మీ ఆశీ ర్వాదం కావాలి.' హిమాలయం సముద్రం రెండూ కలుస్తు న్నట్టుగా ఉండినది వారిపురి సమాగమం.

## ౨౬

# రెండు మహా సమర్పణములు

## ౧. డా. ప్యారేలాల్ సింహా

ఆ రోజు వారి నాలుగువందల మైళ్ళ పాదయాత్ర సమాప్తమైంది. తమ ౬౫ సంవత్సరాల వయస్సులోకూడా వారు ప్రతిరోజు ౧౫ నుంచి ౨౨ మైళ్ళదాకా నడిచేవారు.

ఉదయం వారి ఛాతీలో కొంచెం నొప్పి ప్రారంభమైంది. దాదాభాయి ముందుకు వెళ్ళకుండా వారిని వారించినారు. కాని ఠాకూర్ జీ మనస్సు అంత సులభంగా ఒప్పుకొనేది కాదు. దాదాభాయి ముందుకు బయలుదేరినారు. అనుష్ఠానమును మధ్యనే ఆపివేయడ మెలాగ ? సాధనను ఖండితం చేయడమెట్లా ? వారు వెనుక నిలువలేకపోయినారు.

ఆ రోజు జిల్లా సమ్మేళనం ఏర్పాటు జరిగి ఉండినది. భూదాన మూలకము, గ్రామ పరిశ్రమలు ప్రధానంగాగల అహింసాత్మక విప్లవం పైన వారు గంటన్నర సేపు ప్రసంగించి నారు. సాయంకాలం కార్యకర్తలతో జరిగే చర్చలో కూడా పాల్గొన్నారు. పరస్పర పరిచయ కార్యక్రమంలో కూడా పాల్గొంటూ వారిలా అన్నారు : 'చూడండి ! ప్రజలు నన్ను ఊరికేనే వృద్ధుడని అంటుంటారు. ఇతనికి మనోవ్యాధి ఉన్నదని కూడా అంటారు. అయినా, ఇప్పటికీ నేను ౨౨ మైళ్ళు నడువ గలుగుతాను. యువకులు అలసిపోతున్నారు. కాని నాకు అల సట ఏ మాత్రం కలుగడం లేదు.'

కాని వారికి పరమేశ్వరుడు ఎల్లప్పటికీ విశ్రాంతి నివ్వ దలచుకొన్నాడు.

రాత్రి తొమ్మిది గంటల సమయం. వారు పడకమీద పడుకొన్నారు. తొమ్మిది నలభై అయిదు నిమిషాలకు హృద్బాధ ప్రారంభమైంది. డాక్టరు కోసం వెంటనే మోటారు పంపించ బడింది. కాని సమ్మేళన స్థలం అయిదు మైళ్ళ దూరాన ఉన్నది.

అక్కడినుంచి. డాక్టరు సమయానికి రాలేకపోయినాడు. చేరు కున్నా గాని విధిని మార్చగలిగేవారా ?

పదిన్నరకు ఠాకూర్ గారి పదయాత్రకు పూర్ణాహుతి వారి దేహయాత్ర పూర్ణాహుతితో జరిగింది. ఆఖరు క్షణంవరకు వారి నోటినుండి రామనామం వస్తూనే ఉండెను. మృత్యు సమయంలో కూడా వారి ముఖం అత్యంత శాంతంగాను, ప్రసన్నం గానూ ఉండినది. వారు మృత్యువును కూడా వరదానముగా మార్చివేసినారు.

ఠాకూర్ జీ భూదాన యజ్ఞంలో ఆహుతులై పోవడానికి ఇష్టపడ్డారుకాని ముందుకు వేసిన అడుగు వెనుక కెప్పుడూ తీయలేదు.

భూదాన ఉద్యమంతో వారు రోజు రోజుకు సంలీను లవుతూ వచ్చినారు.

ప్రతిపక్ష నాయకులవుతూకూడా కాంగ్రెసుతోనూ ఇతర పార్టీల నాయకులతోనూ కలిసి మెలిసి హృదయపూర్వకంగా సహకరించినారు. అందుకు వారి పార్టీమిత్రులు వారిని అనేక సార్లు వ్యతిరేకించినారు. కాని ఆవ్యతిరేకతల నన్నిటిని ప్రేమ పూర్వకంగా సహించినారు. అందరితోనూ స్నేహపూర్వకంగా వ్యవహరించినారు. భూదానోద్యమ కారణంగా వారు పక్ష నిష్ఠ, ప్రతీకారాత్మక ప్రవృత్తులను అధిగమించి లోకనిష్ఠగల క్రాంతి సందేశకులు కాగలిగినారు. ఈవిధంగా వారు ప్రజల హృదయాలలో మానవత్వంయొక్క మూల్యాల బీజాంకురం

చేస్తూ ముందుకు వెళ్ళిపోతూ ఉండిరి. ఈలోపుగానే వారు దేహాన్ని విడిచివెళ్ళినారు.

సమ్మేళనం ప్రారంభం ఈ మహాసమర్పణయోగంతో జరిగింది. భూదాన యజ్ఞం అమరమైపోయింది.

## ౨. శ్రీమతి శాంతా బహన్ డోంగ్రే

తన చదువు పూర్తికాగానే శాంతాబహన్ సేవా కార్యంలోనికి ప్రవేశించింది. అకోలా 'మహిళామండలిలో' కూడా ఆమె పనిచేయడం ప్రారంభించింది. ఆరోజుల్లోనే శ్రీ శంకర రావుదేవ్ పదయాత్ర ప్రారంభమైయుండినది. 'మహిళామండలి' ఔదాసీన్యం శాంతాబహన్‌కు తీవ్రమైనబాధ కలిగించింది. ఆమె స్వయంగా భూదానంలోకి దూకడానికి నిశ్చయం చేసుకొన్నది. ఆసమయంలో ఆమె వయస్సు ఇరవై రెండు సంవత్సరాలు.

శాంతాబహన్ ఆరోగ్యం చిన్నతనంనుంచే చాలా బల హీనంగా ఉండేది. పన్నెండుసంవత్సరాల వయస్సు వచ్చేదాకా కేవలం పాలే ఆమెకు ఆహారం. అందమైన వెండిగ్లాసులో బళ్ళోకే పాలు పంపించబడేవి. ఆమె చదువుకొనేరోజుల్లో మోటార్లోనో లేక ఏదైనా వాహనం మీదనో స్కూలుకు, కాలేజీకి వెళ్లుతుండేది. ఇటువంటి సుకుమారి పదయాత్రలో ఎట్లా ఉండగలుతుగుంది? అందరినీ ఈ సందేహం బాధించింది. కాని ఆమె సంకల్పం మాత్రం దృఢతరమైనది. భూదానయజ్ఞ ఆహ్వానసమయంలో మిగతా అన్ని విషయాలు గౌణము లుగా ఆమె భావించింది.

ఒక సంవత్సరం బీహార్లో పనిచేసింది. రెండునెలలు మేము గయాలో కలిసి పదయాత్ర చేసినాము. ఈ యాత్రలో ఆమె నమ్రత, విద్వత్తు, పరిశ్రమశీలత, కార్యకుశలత నన్ను ఆమెవైపు నకు ఎక్కువ ఆకర్షించినవి. వయస్సులో ఆమెకన్నా ఆరు సంవత్సరాలు చిన్నదాన్ని. అయినా ఆమె నన్ను ప్రేమాస్పదు రాలుగా భావించేది. మా ఇద్దరిలోనూ అక్కచెల్లెళ్ళలాంటి స్నేహసంబంధ ముండినది. మిత్రురాలుగా నాతో సలహా సంప్ర దింపులు చేసేదామె. నాకన్నా పెద్దదైనా, భూదానోద్యమం ప్రారంభకాలంనుండీ ఉన్నదాన్ని కనుక ప్రతి విషయం మీదా నాతో ఆలోచన చేస్తూ ఉండేది. నా సూచనలకు ఆమె ఎంతో విలువ నిచ్చేది. ఆమె ఈ ఔదార్యం, ఆమెలోని గొప్పదనంవల్ల మెత్తబడేదాన్ని, అయినా ఆమె ప్రేమముందు ఓడిపోయేదాన్ని.

బుద్ధగయ సమ్మేళనం తర్వాత పూజ్య వినోబాజీ సత్సాం గత్యంలో కూడా కొన్నాళ్ళు ఉన్నదామె. ఈమధ్య కార్య భారం కూడా ఎక్కువే పైనవేసుకున్నది. ప్రవచనాలను వ్రాయ డం, ఉత్తర ప్రత్యుత్తరాలు, వచ్చిపోయే వారిని వినోబాజీతో కలిపించడం, కార్యకర్తలతో చర్చలు, మహిళాసభల్లో, ఒకోసారి ప్రార్థనాసభల్లో కూడా భూదానతత్వం వివరణ చేయడం ఇత్యాది పనులన్నీ ఎంతో ఆత్మవిశ్వాసంతో ఆమె చేస్తూ ఉండేది. వినోబాజీ చరణసేవలో కూర్చుండి నిత్యనూతన ప్రేరణ పొంద సాగిందామె.

ఈ మధ్య ఆమె తల్లిగారి అస్వస్థతకారణంగా కొన్నాళ్లు ఇంటికి రావలసి వచ్చింది. సేవ అవసరం పూర్తికాగానే ఆమె

మళ్ళీ పాదయాత్రలోకి వచ్చిచేరింది. ఠాకుర్ ప్యారేలాల్ సింహ, దాదాభాయి నాయర్ యాత్రాదళంలో చేరింది. ఎంతో బల వంతం చేసినప్పటికీ ఆమె ఉపన్యసించకపోయేది. దాదాభాయికి పూర్తిగా సహకరించడమే తన పని అనుకొన్న దామె. ఎంత చెప్పినా వాహనమును ఎప్పుడూ ఉపయోగించకపోయేది.

కాని ఠాకూర్ జీ దివంగతులైన తర్వాత వెంటనే తన బాధ్యతను గుర్తించిందామె. అప్పుడామె సభల్లోకూడా చెప్ప నారంభించింది. కార్యకర్తలతో సంబంధం పెట్టుకోవడం ప్రారం భించింది. బిలాస్‌పూర్ సమ్మేళనం కొరకు ఒక ప్రణాళికనుకూడా ఆమె సిద్ధంచేసి ఉంచింది. ఈ సమ్మేళనం తర్వాత యాత్రాదళ నిర్వహణ ఆమె చేయవలసి ఉండింది. ఆమెలోని సహృదయత అందరికీ ఆమెమీదగల ప్రేమను రోజు రోజుకు ఇనుమడింప జేసింది. కాని పరమేశ్వరునికి బహుశః ఆమె ఎక్కువ ప్రియతమురాలు అయిందికాబోలు. అందుకేనేమో కేవలం పన్నెండు గంటల అనారోగ్యం తర్వాత ఆమె అంతర్ధానం అయింది. అంత్యఘడియలవరకు ఆమె ఎంతో ప్రసన్నంగా ఉన్నది. ఒకేభావం ఆమె మనసులో ఉండేది– 'భూదానయజ్ఞం సఫలమువుగాక !'

అరపానదిలో శాంతాబహన్ అస్థికల నిమజ్జనం జరిగింది. భూదానయజ్ఞ అనుష్ఠానంలో ఒక మహాసమర్పణం జరిగింది. శాంతా బహన్ అమరురాలైంది. భూదానయజ్ఞం అమరమైంది.

పూజ్య వినోబాజీ ఠాకూరుజీ, శాంతాబహన్లను గురించి దాదాభాయికి వ్రాసిన లేఖ ఈవిధంగా ఉన్నది.

"దాదాభాయి,

ఠాకూర్ ప్యారేలాల్ సింహ, శాంతా డోంగ్రే ఇరువురూ తమ జన్మలను సార్థకం చేసుకొన్నారు. పరమేశ్వర పథంలో పయనించే పథికులు రోగశయ్యాపైన మరణించలేదు. వృక్షమునుండి పండురాలినట్లే వారు దేహాలను వదిలి వెళ్ళిపోయినారు. మాకోసం భగవంతుని తరఫున చాలా గొప్ప ఆశ్వాసమిది. ఇటువంటి సంఘటనవల్ల మా హృదయంలోని శ్రద్ధ, కాళ్ళల్లో బలం పెరిగినవి. మీ సహధర్మచారిణి కూడా మిమ్మల్ని ఇట్టి పరిస్థితుల్లో పాదయాత్ర జారీగా ఉంచవలసిందిగా సలహా ఇచ్చినారు. పరమేశ్వర ప్రేరణ ఏవిధంగా పనిచేస్తుందో తెలుసుకోవడానికిది ఒక సంకేతం. మనం అహంకారాన్ని వదలుకొని నిమిత్తమాత్రులమై పోవలెను.

అంతరంగంలో నైర్మల్యం, వాణిలో మాధుర్యం, కాళ్ళల్లో శక్తిగలిగి పరమేశ్వరుని మార్గంలో పయనించే పథికుడు సతతం తిరుగుతూనే ఉండవలెను. అట్టివాని వెనుకాముందూ భగవంతుడు నిలిచివున్నాడు.

వినోబా ప్రణతులు"

సమాప్తం.

# వినోబాజీ సందేశము

"భూదాన విప్లవం అతివేగంగా ముందుకు సాగుతున్నది. ఆ విప్లవం గ్రామ గ్రామానికి చేరవలసియున్నది. ఆ విప్లవ సందేశ వాహకుల జీవితములు ధన్యములు. భావ ప్రచారంవలన విప్లవం ఏర్పడుతుంది. కనుక ఇంటింటికి భూదానోద్యమ తత్త్వము భావము అందే ఏర్పాటు జరగవలెనని అనేకపర్యాయములు చెప్పిఉన్నాము.

భూదాన యజ్ఞమూలకము, గ్రామోద్యోగ (పరిశ్రమల) ప్రధానమునైన అహింసాత్మక విప్లవమునకు శాస్త్రము నెమ్మది నెమ్మదిగా ఏర్పడుతున్నది. ఇప్పటికి ఆ సాహిత్యం గూడా కొంత వెలువడింది. కనీసం ప్రతి తాలూకాలో సర్వోదయ సాహిత్యం లభించే ఒక స్థానమైనా ఉండడం చాలా అవసరం. ఈ ఉద్యమాభిమానులు తమ ధనాన్ని ఈ పనికి కొంత వినియోగించి జిజ్ఞాసువులకు ఈ "భావములు" అందు అవకాశము కలుగజేయాలి. హైదరాబాదులోని సర్వోదయ సేవకులు ఈ విషయంలో ఎక్కువ శ్రద్ధవహించి ఈ లోటు లేకుండ చేయగలరని ఆశిస్తున్నాను. హైదరాబాదు అనగా అది సంపూర్ణ భారతంయొక్క సంక్షిప్త స్వరూపము. భారతదేశంలోని అన్నిభాషల కది సంగమస్థానము. హైదరాబాదులోని ఈ ప్రణాళిక విజయవంతం కాగలిగితే మిగతా ప్రాంతములు హైదరాబాదును అనుకరించగలవు. హైదరాబాదులోనే భూదానయజ్ఞం ప్రారంభమైనది. కనుక ఈ బాధ్యత స్వాభావికంగానే హైదరాబాదుమీద ఉంటున్నది.

వినోబా కే ప్రణామ్

**Check List**

| | | | |
|---|---|---|---|
| Book Number | AAL02C158 | Date | 30/09/2021 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 95 ., | | |
| Missing Pages | NO | | |
| Prepared | Sandhya | Scanned | Mounika |
| BOOK SIZE | H 7.3 W 4.8 | Pages | 104 |

